# సామ్రాజ్యవాదము.

## ఒకటవ భాగము.



సామ్రాజ్యవాదమను పదము అధికముగా వాడబడుచున్నది. 1899లో దక్షిణాఫ్రికాలోని ట్రాన్సువాల్, ఆరంజి ఫ్రీస్టేట్ యను రెండు స్వతంత్రరాజ్యములను వశపరచుకొనుట కొనర్చబడిన యుద్ధమే సామ్రాజ్యవాదయుద్ధమనిరి. (Imperialist war) అప్పటినుంచి పత్రికలలోను పుస్తకములలోను, తరచు ఈశబ్దమును గూర్చి వ్యాఖ్యలు మొదలిడినవి. సామ్రాజ్యవాదమను విషయముపై ప్రత్యేక సాహిత్యముకూడ నేర్పబడెను. సామ్రాజ్యవాదమునుగూర్చి భిన్నభిన్నాభిప్రాయములుగలవు. కొందరుప్రభుత్వమే సామ్రాజ్యవాదమనిరి. మరికొందరు "జీవితసంఘర్షణమే" సామ్రాజ్యవాదమనిరి. ఇతర దేశములను జయించి, మాతృభూమికి ఓడిపోయిన దేశములను బానిసదేశముగా చేయుటే సామ్రాజ్యవాదమని కొందరు భావించిరి. వ్యవసాయమే ప్రధాన పరిశ్రమగాగల దేశముల జయించుటే సామ్రాజ్యవాదమని మరికొందరి వాదన. ఇట్లు భిన్న భిన్న వాదనములు

చలరేగినవనుటలో సందేహము లేదు. ఎవరు ఏవాదనను ప్రయోగించినను ప్రతివారు ఏదియో యొకవర్గమునకు అనుకూలముగ తమ వాదములను సృష్టించుకొనిరి. అదియును సహజమే! సంఘములు, వర్గములు, వున్నంత కాలము నిష్పక్షపాతబుద్ధితో చింతించుట కష్టము. అయినప్పటికిని సంఘములోని ఆచారవ్యవహారములను కట్టుబాట్లను ఆర్థికవిధానములను సాంఘిక దురాచారములు మొదలుగా గల విషయములను నిష్పక్షపాత బుద్ధితో నాలోచించు వ్యక్తులు లేకపోలేదు. ఎప్పుడును వైజ్ఞానిక పద్ధతులనే విమర్శన కవలంబించ వలయును. అభివృద్ధిని (Progress) కోరిన వైజ్ఞానికపథముననే తొక్కవలయును. సామ్రాజ్య వాదమునుగూడ వర్గీయస్వార్థముల కొఱకు పెడత్రోవను పోయి పరిశీలింపక వైజ్ఞానికదృష్టితో చూద్దాం. యీ విషయమునుగురించి నిష్పక్షపాత బుద్ధితోనాలోచించి విమర్శకు గడంగినవారిలో నగ్రగణ్యుడు "లెనిన్" యొకడు. "లెనిన్" ను గురించి వినని పాఠకులుండరని నే ననుకొనుచున్నాను. ప్రపంచములో నైదవభాగములోని ప్రజలను క్రూరసామ్రాజ్యవాదదాస్యశృంఖలములనుండి విముక్తిగావించి సుఖజీవనమును చేసూర్చిన మహానుభావుని యెవరు మరువగలరు.

సామ్రాజ్యవాదముకూడ నొక ఆర్థికవిధానమే. ఆర్థిక విధానపరిణామములో నొకస్థాన మలంకరించినది. ధనస్వామిక మొనర్చలేని కార్యములను సామ్రాజ్యవాద మొనర్చుచున్నది. ధనస్వామికములో పరిశ్రమము లభివృద్ధిచెందుచు పారిశ్రామికాభివృద్ధి బాగుగా పొందిన దేశములలో ధనము మిక్కుటముగా బ్యాంకులలో పోగగును. బ్యాంకులలో గుట్టలుగుట్టలుగా పడియున్న ధనముపేరే "ఫైనాన్సు క్యాపిటల్" (Finance Capital) యని నుడువుదురు. అట్టి "ఫైనాన్సు క్యాపిటల్" ను రక్షించుటకై నిరుపయోగముగా పడియుండకుండచేయుటకే సామ్రాజ్యవాదమను ఆర్థికవిధానమును ధనికులవలంబించుచుండిరి. ధనస్వామికమును రక్షించుకొనుటకుగాను నవలంబించిన ఆర్థికపద్ధతియే "సామ్రాజ్యవాదము" ధనస్వామికము (Capitalism)యొక్క ఆఖరిదశలో నుత్పన్నమగు ఆర్థికవాతావరణమే సామ్రాజ్యవాదము. సామ్రాజ్యవాదమును 5 భాగములుగా విభజింప వచ్చును. (1) పరిశ్రమలపై పూర్ణాధికార స్థాపనము. పూర్ణాధికారములను ఏకొద్దిమంది ధనాఢ్యులచేతులలోనే యుంచుకొనుట, (2) దేశములపై ధనాఢ్యులకు సర్వాధికారము గలుగుట, (3) మూలధనము నెగుమతి చేయుట, (Export of finance Capital) (4) అంతర్జాతీయ ఆర్థికసమూహాములను నిర్మించుకొనుట. (ఇప్పుడు ప్రపంచములో నిట్టి సమూహాములనే

(Cartels,Syndicates, trusts etc.)అని యందురు.(5)ధనాఢ్యులు ప్రపంచమునంతను తమలో తాము పంచుకొనుట. ఇప్పుడు వీటిని వేర్వేరుగా తీసికొని విచారించుదము.

## పరిశ్రమలపై పూర్ణాధికార స్థాపనము.

దేశములలో ధనాఢ్యవాదము ప్రచండస్వరూపము దాల్చినప్పుడు పరిశ్రమము లభివృద్ధిపొందు టందరికిని తెలిసిన విషయమే. వ్యాపారమును విరివిగా సాగించుకొనుటకు ప్రతివాడును స్వతంత్రుడై యుండును. వ్యాపారమే లాభదాయకముగా నుండుతరి ప్రతివాడును యట్టికార్యమునే చేపట్టును. అందుచే లాభములే మూలాధారముగాగల పరిశ్రమలమధ్య పోటీ తప్పదు. ధనాఢ్యులు, పరిశ్రమదారులు, బ్యాంకరులు తమకే లాభము లెక్కువ రావలయునను నుద్దేశముతో పనిచేయుచుందురు. అందుచే ప్రారంభములో ధనాఢ్యులమధ్య స్పర్థలు చెలరేగుట, అనివార్యమగును. పరిశ్రమ పరిశ్రమమధ్య పోటీబాగుగాచెలరేగును.ఇతరులయంత్రశాలలలో తయారగు సరకులకన్న తన కర్మాగారములలో నుత్పన్నమగు సరకులు విరివిగా మార్కెట్టులో అమ్ముడు కావలయునని ప్రతి పరిశ్రమదారుడు కోరుచుండును. విరివిగా సరకు లమ్ముడు కావలయునని కోరిన తమయంత్రశాలలను బలపరచుకొనుచు సరకులను చౌకగా తయారుచేయుటకు

ప్రయత్నించుదురు. మిక్కుటమైన లాభములు గడించవలయునని కోరుచుందురు. సరుకులు విరివిగా అమ్ముడుకావలయునను ప్రేరణలోనే తమ కర్మాగారములచే బహుజనాకర్షణీయముగా నుండునట్లును, చౌకగా నుండునట్లును, సరకుల తయారు చేయుచుండిరి. ఇట్లు ఒకరికన్న నింకొకరు పోటీతో పరిశ్రమలను సాగించుటచే పరిశ్రమ లభివృద్ధిపొందుట మొదలిడినవి. యంత్రశాలలలో తయారగు వస్తువులు విరివిగాను అతిచౌకగాను తయారు అగుట మొదలిడినవి. సరకులు తండోపతండాలుగా బజారులోనికి వచ్చిపడ్డప్పుడు చౌకగా అమ్ముడు అగునప్పుడు కొంతకాలమువరకు లాభములు వచ్చినను పరిశ్రమదారులకు లాభములు వచ్చుట సన్నగిల్లుట మొదలిడును. లాభము లెప్పుడు సన్నగిల్లునో అప్పుడు వ్యాపారస్థులకు లాభములను మరల తిరిగి గడించుట ఎట్లా యను ఆలోచనలు బయలుదేరును. అప్పుడు లాభములుతగ్గుటకు పరిశ్రమ పరిశ్రమమధ్యనున్న స్పర్ధే కారణములని గ్రహించుదురు. పరిశ్రమ పరిశ్రమమధ్యనున్న పోటీ తగ్గించుకొని ఉభయులకు లాభదాయకములగు ఆర్థికవొడంబడికలే శరణ్యములని పెద్దపెద్ద పరిశ్రమదారులు గ్రహించుదురు. పోటీవలన ఎక్కువ నష్టము పెద్దపెద్ద ధనాఢ్యులకే ముందుగలుగుటచే వారికే ఇట్టి వర్తకపు ఒడంబడికలు ముఖ్యావసరములు.అందుచే ముందుపెద్దపెద్ద ధనాఢ్యులు వారివారి పరిశ్రమలమధ్యనున్న

పోటీవిడనాడి రాజీపడుదురు. కొన్ని పరిశ్రమలపై కొందరికి పూర్ణాధికారము యివ్వబడును. తక్కిన ఇతర పరిశ్రమలపై తక్కిన పరిశ్రమ దారునకు పూర్ణాధికారము ఇవ్వబడును. పూర్ణాధికారమున్న పరిశ్రమలతో పోటీచేయుటకు వీలులేదు. ఇట్లు దేశములోని పరిశ్రమలను పెద్దపెద్ద ధనాఢ్యులు పంచుకొందురు. ఒక్కొక్క పరిశ్రమపై ఒక్కొక్కధనాఢ్య సమూహమునకు పూర్ణాధికార మివ్వబడును. అప్పుడే ఆ పరిశ్రమ సరకుల ధరలు ఇంతయని నిర్ణయింపబడును. ఇట్లునిర్ణయించుటకు ఒక కారణము కలదు. ధరలు నిర్ణయించని యెడల పూర్ణాధికారము కలవాడు విచ్చలివిడిగా ధరలు పెంచి సరకుల నమ్ముకొనుచుండును. పోటీ లేకపోవుటచే సరుకు లమ్మడు కావను భయముండదు. ధరలు హెచ్చించుటచే లాభములు మిక్కుట మగును. ఆర్థికముగా నందరికన్న సంపన్నుడగుటచే దేశములో యతనికి బలముకలిగి యితర పరిశ్రమములపై ఆర్థికసమర మొనర్చి వాటిని తన చేతుల లోనికి గొనివచ్చును. ఈకారణముచేత ధరలు పరిశ్రమలపై పూర్ణాధికారమును స్థాపించునప్పుడే నిర్ణయించుదురు. అట్టి నిర్ణయము నుల్లంఘించచూచిన తక్కినధనికపరిశ్రమదారులు కలసి నుల్లంఘించిన పరిశ్రమదారునిపై దండెత్తుదురు. ఇట్లు ప్రథమమున పోటీయున్నప్పటికినీ పరిశ్రమములభివృద్ధిపొందిన తనుపరి దేశములోని పెద్దపెద్ద ధనికులు కలసి పరిశ్రమలను

పంచుకొని ఒక్కొక్క పరిశ్రమపై ఒకొకరి పూర్ణాధికారమును నెలకొల్పుకొనెదరు. పెద్దపెద్ధ ధనికులందరిట్లు యొకఆర్థికసమూహముగాఏర్పడి పరిశ్రమములపై పూర్ణాధికారమును నెలకొల్పుకొను తరి చిన్నచిన్న వ్యాపారస్థులు, పరిశ్రమదారులగతియేమి? పోటీ తీసివేసుకొని సహకారముతో పరిశ్రమముల నడుపుచున్న పెద్దపెద్ద ధనికులతో నెన్నడైనా చిన్నచిన్న పరిశ్రమదారులు పోటీ చేయగలరా? ఎప్పటికిని అసంభవమే! ఆర్థికసమూహముగా నేర్పడిన పరిశ్రమదారులు చిన్నచిన్న వ్యాపారస్థులతో యిట్లు నుడువుదురు. "మీరుకూడ మా పరిశ్రమలతో నేకమైపోవుడు! మాయెడల సహకారభావమును గలిగియుండుడు! మా పరిశ్రమలతో మీ పరిశ్రమల కలపకపోయిన మీరు నశించువరకును మేము మీపై సమర మొనర్చెదము. మేము అధికసంపన్నులము. మీకు బ్యాంకుల నుండి అప్పులిచ్చుట మాన్పివేయుదుము. జాగ్రత్త!"— ఇట్టి భీకరఘోషణములను వారాలకింపనైనా ఆలకింపజాలరు. ఏరోజున పై ధనికులతో పోరాటమో ఆరోజుననే వారి లాభములకు తిలాంజలములు వదలుకొనవలసినదే. వాళ్ళతో పోటీ చేస్తారాఅంటే అది అంతకన్నా సున్న. అందుచే గత్యంతరమేమియూ లేక పై ధనికులకు లొంగవలయును. వారి నిర్ణయములకు బద్ధకంకణులు కావలెను. వారు లాభములు ఎక్కువ పొందుచున్నను గుడ్లు వదలి చూడవలసినదే.

ఈమాదిరిగా దేశమంతటనూ ధనికుల ఆర్థికనిరంకుశత్వము ప్రజ్వలించుచున్నది. పరిశ్రమలపై పూర్ణాధికారస్థాపన మొనర్చబడినది. పోటీలేవియూ లేవు. ఏదో కొద్దిపోటీ చిన్న వ్యాపారస్థులవలన కలుగుచుండిన దానిని పేరు ప్రతిష్ఠ లేకుండా రూపుమాపేరు. ఇష్టమువచ్చినట్లు పరిశ్రమ లభివృద్ధిచేసుకొని లాభములు గడించుచున్నారు. ఇతర దేశ ములపోటీ ఏదైనా వస్తే దేశాలన్నీ ఇతర హంతకులనుండి రక్షించాలి. మన జాతి స్వాష్టవమును కాపాడాలి. దేశములో శాంతి నెలకొల్పాలి అని పెద్దపెద్ద వుపన్యాసములచే ప్రజల దిగ్భ్రమ మొందించి ప్రజాప్రతినిధిసభలలో ఇతరదేశపు దిగు మతులపై పన్నుల విధించి దేశసంరక్షణార్థమై టారిఫ్‌గోడల నిర్మించుదురు. ఇట్లు ఇంటాబయటా దోపిడీచేయుటకు జంకరు. ఈ దోపిడీగాండ్రు యిట్లు దేశమంతటను తమనియంతృత్వము యేర్పరచుకొనిప్రజలనుతమస్వార్థములకై పాటుబడుటకు పురి కొల్పుదురు. పేరునకు దేశము ప్రజలదని చెప్పుదురు. దేశక్షే మమే ప్రజలసౌభాగ్యమందురు. దేశాభివృద్ధియే ప్రజల జీవిత ప్రమాణాభివృద్ధియందురు. వాస్తవమునకు దేశక్షేమమనగా పరిశ్రమలపై పూర్ణాధికారములు నెలకొల్పుకొని, ధనికతంత్రి మేర్పరచుకొనిన హంతకుల రక్షణమే.

సామ్రాజ్యవాదముయొక్క ప్రథమ అవస్థ దేశములో పరిశ్రమలన్నిటిపై ధనికుల అధికారము నెలకొల్పుటయే

ధనికులు దేశమంతను, వారి స్వార్థముల కనుగుణ్య పద్ధతు లతో ప్రజాపరిపాలన మొనర్చురే.

ఇప్పుడు సామ్రాజ్యవాదముయొక్క రెండవ అవస్థను గురించి చెప్పుకుందాము. సామ్రాజ్యవాదము సహజస్వరూ పమును వెల్లడించుచు యీ విషయములో లెనిన్ యిట్లు నుడివెను. ఇప్పటి ఆర్థికప్రపంచస్వభావము విలక్షణమైనది. బ్యాంకులలోనుండెడి ధనము పరిశ్రమలవైపుకు మరలినది. ఇందుచే ఆర్థికప్రపంచకములో ఒకవిధమైన ధనికనియంతృత్వ మేర్పడిపోయినది. బ్యాంకులలో యెక్కువ ధనము గుట్టలు గుట్టలుగా పడియుండుటచే వడ్డీవ్యాపారముతోనే బ్యాంక రులు తృప్తిచెందక దేశ పరిశ్రమలలోగూడ ధనము పెట్టుబడి పెట్ట నారంభించిరి. పరిశ్రమదారులకు బ్యాంకులో ధనము సప్లయి చేయుచుండుటచే, బ్యాంకరులు పరిశ్రమలలో పెట్టు బడి ఎప్పుడు పెట్ట నారంభించిరో అప్పుడే బ్యాంకరులకు పరి శ్రమదారులపై కొంత యాధిక్యత కలిగెను. క్రమ క్రమేణా పరిశ్రమ లన్నియు బ్యాంకరుల చేతులలోనికి వచ్చెను. పరిశ్రమదారులు, బ్యాంకరులు కలసి పోయిరి. ఒకొకచోట బ్యాంకరులే పరిశ్రమ దారులుగా వుండుట తటస్థించెను. ఎట్లయినను బ్యాంకులకు పరిశ్రమలపై పెత్తనము, అధికారము కలిగెను. అందుచే దేశములోని పరిశ్రమలు బ్యాంకులు కలమెలసి వ్యాపారము చేయ

మొదలిడినవి. ధనము బ్యాంకుల చేతులలోనుండుటచే పరిశ్రమ లభివృద్ధి ఎంతయూ బ్యాంకులపై నాధారపడియుండెను. సమస్త పరిశ్రమలు ఏకొద్దిమంది ధనాఢ్యుల చేతులలో పడి వుండి వారి లాభములకే వినియోగింపబడుచున్నవి. బ్యాంకు మేనేజరులే పరిశ్రమదారులుగా మారిపోయిరి. దేశము యొక్క ఆర్థిక జీవితముయొక్క ఆయువుపట్టు బ్యాంకుల హస్తగతమయిపోయెను.

ఈ రోజులలో దేశములోని ప్రధాన పరిశ్రమలకు బ్యాంకులకు నెట్టి ఘనిష్ఠసంబంధమున్నది తెలిసికొనుట ముఖ్యావసరము. జర్మనీ వుదహారణము గైకొని యీ ముఖ్యవిషయమును చక్కగ గ్రహింపగలుగుదుము. బెర్లిన్ నగరములోని ఆరుపెద్దబ్యాంకుల మేనేజరులే దేశములోని 344 వ్యాపారిక కంపెనీలయొక్క మేనేజరులైయుండిరి. ఇవి గాక ఆ బ్యాంకులక్రింద 407 వుపశాఖలు నెలకొల్పబడినవి. మొత్తము ఆ ఆరుబ్యాంకులకు 751 కంపెనీలపై అధికార ముండెను. దేశములోని చాలభాగమువరకు ఆర్థికజీవితమును నిర్వహింపచేయువారు ఆ ఆరుబ్యాంకుల యజమానులే అయివుండిరి. వారి శ్రేయస్సే దేశముయొక్క సౌభాగ్యము. వారిలాభనష్టములే దేశముయొక్కలాభనష్టములుగపరిగణింప బడుచున్నవి. ఇట్లు కొద్దిమంది ధనాఢ్యులయొక్క లాభమే సుఖమే, భోగమే' — — — —

దేశముయొక్క సర్వస్వము. ఇట్లు పారిశ్రామిక ప్రపంచములో ఏకొద్దిమందియో పెద్దపెద్ద ధనాఢ్యుల పూర్ణాధికారము నెలకొల్పబడినది- ఇంకను నెలకొల్పబడుచున్నది. యుద్ధమునకు పూర్వము జర్మనీయొక్క ఆర్థికవిధానమంతయు మొత్తము 300 మంది ధనికుల చేతులలోనే యుండిపోయినది. కాని అప్పటినుంచి యీ సంఖ్యక్షీణించుచునే యున్నది. చిన్నచిన్న బ్యాంకులు పెద్దపెద్దబ్యాంకుల స్పర్థకాగలేక వాటితో కలసిపోవుచున్నవి. పెద్దబ్యాంకులు అంతకన్న పెద్ద బ్యాంకులతో నేకమైపోవుచున్నవి. అమెరికాలో మొట్టమొదట 9 పెద్దబ్యాంకులుగలవు. కాని తరువాత యీసంఖ్య రెంటికి దిగెను. అవే "రాక్ ఫెల్లర్" బ్యాంకు, "మార్గన్" బ్యాంకు. వీరిద్దరే దేశముయొక్క ఆర్థికనావకు చుక్కానుపట్టుచుండిరి. వీరెట్లుతలచిన యట్లే యార్థికనావ నడచుచున్నది. వీరి స్వార్థమే దేశముయొక్క క్షేమము, శ్రేయస్సు. అట్లే ఫ్రాన్సులోకూడ పెద్దబ్యాంకులసంఖ్య 6, 7 నుంచి 4 వరకు దిగిపోయెను. ఈ పరిణామముయొక్క అర్థమిది. ఇప్పుడు ప్రతిదేశములోను ఒకవిధమైన ధనికతంత్ర మేర్పడినది.—— అనగా ఇచ్చటి పరిశ్రమములు కేవలము ఇరువదియో ముప్పదియో ధనికుల చేతులలోనికి వెళ్ళిపోయినవి.

ఇప్పటి ఆర్థికప్రపంచకముయొక్క విశేషత ధనాఢ్యుల నియంతృత్వ మేర్పడుటయే. ప్రజలు సహజముగా శాసన

సభలు వారికొఱకై ఏర్పరుపబడినవనియు క్షేమదాయకము లైన శాసనములు వారికి చేసిపెట్టుచుండుననియు తలచు చుందురు. వాస్తవమునకు శాసనసభలు మన ప్రతినిధుల సంస్థలేయని పాపమా, పిచ్చి ప్రజలు తలచు చుందురు. పేరునకు దేశములో ప్రతినిధులను పంపుటకొక ప్రణాళికను తయారు చేసినప్పటికిన్ని వాస్తవమునకు ఏకొద్ది మంది ధనాఢ్యులే—వీరే బ్యాంకు యజమానులు—సమస్త యార్థిక నీతిని పాలించుచుండిరి. తమ స్వార్థరక్షణకై యార్థిక నీతిని మార్చుచు తిరిగి క్రొత్తవిధానముల నిర్మించుచు శాసన సభలలో శాసనములను సృష్టించుదురు. ఇట్టి శాసనములు జాతిశ్రేయస్సుకని ధనాఢ్యయార్థిక శాస్త్రవేత్తలు వాదించు చుందురు. ఇట్లు ఇప్పుడు శాసనసభలను శాసనసభలకు మూలాధారమైన "ప్రజాస్వామిక" సిద్ధాంతములను ధనాఢ్యు లస్వార్థములకే నుపయోగించుకొనుచున్నారు. సైన్యమును గురించిన విషయములలోను పరరాష్ట్రనీతివిషయమై వారికి సంపూర్ణరక్షణ (Safeguards and reservations) లుండును. సామాన్యప్రజలకు- కార్మిక కర్షకులకు- తెలియ కుండగనే ప్రజాస్వామిక సిద్ధాంతములను ధనాఢ్యుల స్వార్థములకై వినియోగించు చుండిరి.

ఇట్లు సామ్రాజ్య వాద విస్తరముచే నొక విధమైన ధనికతంత్రము, ప్రజాప్రతినిధి సభలు పేరునకు

వున్ననూ, దేశములోని పరిశ్రమలు బ్యాంకర్ల చేతుల లోనికి వచ్చినవి. దేశమును పరిపాలించు సంస్థలు ప్రజాప్రతినిధిసభలు కావనియూ, బ్యాంకులే దేశమునంతను పరిపాలించుచున్నవనియూ, తెలియుచున్నది. సామ్రాజ్య వాదముచే గలిగిన ఆర్థికపరిస్థితుల పరిణామమేమనిన ధన స్వామికమువలన గలిగిన కార్మిక కర్షకదోపిడి మరింతవిరివిగా కొనసాగబడుచున్నది. కార్మికసేన లభివృద్ధిబొందుచున్నవి. సంపద నొకవైపున గుట్టలుగుట్టలుగా పెరిగిపోవుచున్నది. మరియొకవైపున క్షుద్బాధరోదనలు వినబడుచున్నవి.

సామ్రాజ్యవాదముయొక్క తృతీయావస్థను వర్ణించుచూ లెనిన్ ఇట్లు నుడివెను. "ఇప్పుడు సరకుల నెగుమతి చేయుటకన్నా ధనము నెగుమతిచేయుట మొదలిడిరి."

ధనాఢ్యులవాదము ప్రారంభదశలో పూర్ణమైన పోటీతో కొనసాగుచుండును. అప్పుడు ఎక్కువగా తయారు ఐయిన సరకులను బయటకు (ఎగుమతి)పంపుచుండెడివారు. కాని ధనాఢ్యులవాదము వికాసముపొందినకొలదిపరిశ్రమలపై పూర్ణాధికారము నెలకొల్పినప్పుడు పారిశ్రామిక దేశములు తయారు చేయబడిన సరకుల నెగుమతిచేయుటకు ఎక్కువ ప్రయత్నింపక ధనము (capital) నే నెగుమతి చేయుట ప్రారంభించిరి. ఇందువలన ఎక్కువ లాభము వచ్చుటచే పారిశ్రామికాభివృద్ధిలో అన్నిటికన్నా ముందు గ్రేట్‌బ్రిటన్

ముందుకు పోగలిగెను. యంత్రముల ప్రయోగించుటలోనూ, బట్టలమిల్లులు, ఇనుప పరిశ్రమలకార్ఖానాలు స్థాపించుటలోనూ, బ్రిటనే అన్ని దేశములకన్నా ముందుకు పోయెను. అందుచే అది గొప్ప పారిశ్రామికవృన్నతి అన్ని దేశములకన్నా ముందు పొందెను. ప్రపంచములోని అన్ని దేశములలోను, బ్రిటనువస్తువులే విచ్చలవిడిగా అమ్ముడు అగుచుండెను. పందొమ్మిదిశతాబ్దములో బ్రిటనదేశపుసరకులు కొనని దేశమే లేదు. 1870 వరకు అట్టి పరిస్థితులు చెక్కు చెదరకుండా వుండిపోయినవి. తరువాత ఫ్రాన్సు, జర్మనీ, అమెరికా, మున్నగు దేశములు పారిశ్రామిక క్షేత్రములోనికి దుమికినవి. 20 వ శతాబ్దము ప్రారంభమగుసరికి ఇట్టి యే రెండుమూడు పారిశ్రామిక దేశములో వ్యాపారముమీద తమ పూర్ణాధికారము స్థాపించుకొనగలిగినవి. ఇట్టి దేశములలో పెట్టుబడికి కావలసిన ధనముకన్నా ఎక్కువధనము పోగైపోయినది. పూర్ణాధికారములయొక్క పరిణామము బ్యాంకులలో మిక్కుటమైన ధనము పడియుండిపోయినది. ఫ్యాక్టరీలు కట్టుటకునూ రైళ్ళు వేయుటకునూ గనులనుండి ఇనుము, బొగ్గుత్రవ్వుటకు పెట్టుబడిక్రింద ఎంతధనము హెచ్చించుచుండిరో అంతకన్నా మిక్కుటముగా ధనాఢ్యులకు లాభములు వచ్చుచున్నవి. ఖర్చులన్నిటినీ తీసివేసినమీదటకూడ తగినంత ధనము లాభముల క్రింద మిగులుచున్నది. ఇట్టి ధనము నేమురలక్ష వంతమైన

కార్యములకువినియోగించుచుండిరి. ఇట్లులాభములుగామిగిలిన ధనమును ఏదోఒక పరిశ్రమాభివృద్ధికి వినియోగించుచుండిరి. కాని లాభములకుగూడ హద్దులుకలవు. అట్టి హద్దులను దాటి లాభములు పోజాలవు (అనగా కొంతకాలమునకు పరిశ్రమములలో పెట్టుబడిన ధనమువల్ల లాభములు రాకుండా పోవచ్చును) ఇట్టిహద్దుదాటినపై లాభములనుపెట్టుబడిపెట్టుటచే విశేషలాభములు రాకుండా పోవును. అట్టి అవస్థలో తమ దేశీయపరిశ్రమలలో పెట్టుబడి పెట్టుటచే తగినంత లాభములు రానట్టి దేశములు పారిశ్రామికాభివృద్ధిపొందక వెనకబడియున్నట్టి అసభ్యతదేశములకు తమ లాభములరూపేణావచ్చు ధనమును ఎగుమతిచేయుట ఆరంభించిరి. అట్టిదేశములలో కూలి చౌకగా గిట్టును. అదియొక పెద్దలాభము. పరిశ్రమాభివృద్ధిపొందిన దేశములలో భూములకు వత్తిడియుండుటచే ఖరీదు ఎక్కువగా వుండును. అట్టికష్టమేమియూ లేకయే అసభ్యతదేశములలో భూమిచౌకగా కొనవచ్చును. ముడిపదార్థములకు వెదకికొను నవసరమేమియూ నుండదు. ముడిసరకులు దేశములోనే దొరకుటచే సులభము గాను చౌకగాను లభించును. 1914 సం॥వరకు బ్రిటన్, ఫ్రాన్సు జర్మనీ విదేశములలో తమ ధనమును ఎంతవరకు పెట్టుబడి పెట్టినది, క్రిందిపట్టిక తెలియపర్చును.

## విదేశములలో పెట్టిన పెట్టుబడి.

| సం॥ | బ్రిటన్ | ఫ్రాన్సు | జర్మనీ |
|---|---|---|---|
| 1862 | 3—6 | | |
| 1872 | 15 | 10 | |
| 1893 | 42 | 20 | 8—5 |
| 1902 | 62 | 27—37 | 12—5 |
| 1914 | 75—100 | 60 | 44 |

20 వ శతాబ్దము ప్రారంభమగుసరికి పెట్టుబడి ఎంత విరివిగా సాగినదో అంత విరివిరిగా మొట్టమొదటదినములలో సాగియుండలేదని యీ పైఅంకెలవలన స్పష్టమగుచున్నది.

1862 లో బ్రిటన్ మొత్తము 3—6

ప్రాంకులనే విదేశములలో పెట్టుబడి పెట్టినదికాని 1914 వచ్చుసరికి అసంఖ్య వందవరకు పెరిగిపోయెను అనగా 52సం॥ రములలోనే దాదాపు 30రెట్లు పెరిగిపోయెను. అట్లేవిదేశములలో వుంచిన ఫ్రాన్సు, జర్మనీలయొక్క పెట్టుబడిధనము 1914 వచ్చుసరికి (అనగా 42—12 సంవత్సరములలో, 4–5రెట్లు పెరిగిపోయెను. ఏదేశమైనా అధిక పారిశ్రామికాభివృద్ధి పొందుచున్నప్పుడు అచ్చట ఇంకనూ క్రొత్త క్రొత్త పరిశ్రమలను స్థాపించుటకై లాభజనకముగాయుండదు.

అట్లు పరిశ్రమలలో పెట్టుబడిపెట్టు ధనముమీద వచ్చులాభము కన్నా పారిశ్రామికాభివృద్ధిపొందని అసభ్యతదేశములలో ధనమును పెంచ్చుచుట అధికలాభదాయకము. ఇట్లు విదేశములకు రుణరూపమున ఇచ్చిన ధనమువలన అధికలాభములు వచ్చుచున్నవి. డై బ్యాంకు అను పేరుగల బెర్లిన్ మాస పత్రిక 1913సం॥ అక్టోబరు సంచికలో ఇట్లు చెప్పబడినది. "స్పైన్ నుండిబాల్కన్ ద్వీపముల వరకును, రష్యానుండి అర్జెన్టయిన్ వరకును, బేజిన్ నుండి చీనాదేశము వరకును, నుండు బహు దేశములు రుణపత్రములద్వారా ధనమును వాంఛించుచున్నవి. వర్తక వ్యాపార అవస్థ యిపుడు సంతోషజనకముగా లేదు. రాజనీతికూడా చీకటి కామిరలచే కప్పబడియున్నది. (కూటనీతితో కూడుకొని యున్నది.) అయినప్పటికి ధనసంపత్తిచే తులతూగు దేశము రుణమిచ్చుట మానుటలేదు. రుణము ఇచ్చుదేశములకు ఒకభయముకలదు "నేను రుణమివ్వకపోతినా నాయబ్బ ఇంకొకడు బయలుదేరును. అందుచే అతనికి ఇతరులకురుణము ఇచ్చుటచే అధిక సౌకర్యములు ప్రాప్తమగును- ఇట్లు ఏదేశమైనా ఇంకొక దేశమునకు రుణము ఇచ్చుచున్నదనిన దానికి రుణమువల్లవచ్చు లాభము వడ్డీయే కాదు. అట్టి దేశమున కనుకూలముగా వ్యాపారవడంబడికలు జరుగుచున్నవి. అప్పు తీసుకొన్న దేశములతో అట్లుకానియడల బొగ్గుగనులనుండి

బొగ్గు త్రవ్వుకొనుటకు వీళ్ళు ఏర్పరుపబడుచున్నవి. అట్లు గాక—అధమపక్షమున ఒకటో, అరో, ఓడ రేవులు తయారు చేసుకొనుటకు సదుపాయములు ఏర్పరుప బడుచున్నవి. అదే కాక—సైనికసామగ్రి కొంతవరకు ఖరీదు చేయుటకు షర తులు ఏర్పరుప బడుచున్నవి.

ప్రపంచములో కొన్ని దేశములు పారిశ్రామికాభివృద్ధి పొందినవి. కొన్ని పరిశ్రమలే లేక చాల పేదదేశములుగా నుండి పోయినవి. అట్టి దేశములే అసభ్యతదేశములని చెప్ప బడుచున్నవి. అట్టి అసభ్యతదేశములలో పెట్టుబడిపెట్టి పారి శ్రామిక దేశములు ఘనిజసంపత్తిని దేశ సౌభాగ్యమును "మేము అసభ్యతదేశములను సభ్యవంతములు చేయవలెను. మమ్ములను భగవంతుడు వారికన్నా అధిక సంపన్నులుగాను, సభ్యమయులుగాను, నిర్మించి మాకన్నా వెనకబడియున్న దేశములకు సభ్యతను నేర్పుటకు మమ్ములను నియోగించి యుండెను" అని సాకుచెప్పచూ విచ్చల విడిగా కొల్లగా గొట్టు చుండిరి. అట్టి దేశములలో రైళ్ళను వ్యాపార సౌకర్యము కొరకు (ప్రజల ప్రయాణసౌకర్యములకు కాదు.) నిర్మించుచుందురు. కోటలుకట్టుదురు. సైన్యమువలన దేశాక్రమణ చేసుకొని యనేక విధముల దేశమును వాడుకొందురు. ధన మును ఇతర దేశములకు ఎగుమతి చేయుటలో నొకముఖ్యో ద్దేశముకలదు. ప్రతిరాష్ట్రములలోనూ సైనికవాదము ప్రబల

మగుచున్నది. ఇందుచే సామ్రాజ్యస్థాపనము నిరాటంకముగ కొనసాగింప బడుచున్నది.

సామ్రాజ్యవాదముయొక్క నాలుగవపద్ధతిని గురించి నేర్చుకొందాము. లెనిన్ ఈ అవస్థను ఇట్లువర్ణించియుండెను. "ధనాఢ్య అంతరజాతీయసంస్థలు నలుదిశలను తమ పూర్ణాధికారముల నెలకొల్పుకొని ప్రపంచము నంతటనూ తమలో తాము పంచుకొనుచున్నవి. పారిశ్రామిక క్షేత్రములో పూర్ణాధికారముయొక్క పరిణామమును గురించి ముచ్చటించుకొనునప్పుడు మనము ఈ విషయము గ్రహించి యుంటిమి. మొట్టమొదటలో భిన్నభిన్న దేశములలో ప్రత్యేకముగా పారిశ్రామిక వ్యాపారసమూహములు (Trade & commercial companies) స్థాపించబడుచున్నవి. ఇట్లే దీని తరుపరి వివిధరాష్ట్ర సమూహము కలసి అంతర్జాతీయసమూహముల కొన్నిటిని యేర్పరచుకొనుచున్నారు. తమలోతాము ఆలోచించుకొని ప్రపంచములోని మార్కెట్టును తమలో తాము విభజించుకొనుచున్నారు. ఈ విధముగా దేశములోని పరిశ్రమలమీదనే పూర్ణాధికారము నెలకొల్పుటకు బదులు అన్నిదేశములూ కలసి అంతర్జాతీయసమూహములు ఏర్పరచుకొనుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

లెనిన్ యలక్ట్రిక్ పరిశ్రమలను ఉదాహరణముగా తీసికొని ఈ విషయమును చక్కగా పరిశీలించియున్నాడు.

ప్రపంచములోని అన్ని ఎలక్ట్రిక్ పరిశ్రమలపైననూ 1907 వరకు ప్రపంచములో జర్మనీ అ మె రి కా ల కు పూర్ణాధికారముగలదు. మొట్టమొదట్లో జర్మనీలో విద్యు శ్ఛక్తి పరిశ్రమలు చాలా ఎక్కువగాను, విడివిడిగాను యుండెను. 1900 సంవత్సరము వచ్చుసరికి అనగా ఆర్థిక దుస్థితియున్నరోజులలో పెద్దపెద్దసమూహములుకలసి యొకటి రెండుగా అగుటకు ప్రయత్నించి సఫలీకృతమైనప్పుడు చిన్న చిన్న పరిశ్రమల పెట్టుబడి నాశనముగుతరి బ్యాంకులను ధన సహాయము అడిగినప్పుడు బ్యాంకులేవియూ చలించియుండ లేదు. అట్టి విపరీతాఅవస్థలోకూడ బ్యాంకులు వీటికి సహా యము చేయక పెద్దపెద్దబ్యాంకులను కలసి యే ఒకటో రెండో సమూహములుగా చేసినది. దీని యర్థమిది. చిన్న చిన్న పరిశ్రమలు దివాళాతీసినవి. దివాళాతీయకుండా ఎట్లో బయటపడ్డవికూడ పెద్ద సమూహములలో కలసిపోయి వాటి ఆజ్ఞలనే శిరసావహించవలసివచ్చెను.

1908 వచ్చుసరికి జర్మనిలోని విద్యుశ్ఛక్తిపరిశ్రమ లన్నియూ ఏకమై ఒకటో రెండో సమూహములలో కలసి పోయినవి.ప్రసిద్ధిచెందిన(The several electric company) సమూహములలో సుమారు 200 ఫ్యాక్టరీలు కలసిపోయినవి. ఈవిధముగానే అమెరికాలోకూడ విద్యుశ్ఛక్తి సమూహ మొకటి యేర్పడెను. 1907-1908 వరకు అమెరికా, జర్మనీల

సమూహములమధ్య ప్రపంచములోని అన్ని విద్యుచ్ఛక్తి పరిశ్రమల పంపిణీజరిగెను. విద్యుచ్ఛక్తి సమూహములవలెనే నూనె, పంచదార, ఇనుమువ్యాపారము, ఓడలుమొదలగు పరిశ్రమలకుగూడ అంతర్జాతీయ వ్యాపారిక సమూహము లేర్పడిపోయినవి.

వ్యాపారిక సమూహములను ఇట్లుస్థాపించుట కావశ్య కతయేమి? దీని నిదివరకే కొంచెము సంక్షిప్తముగా నుడివియుం టిమి. సమూహములు స్థాపించుటవలన యొకదేశములోని పరిశ్రమలకు మరియొక దేశములోని పరిశ్రమలకు మధ్య నుండు పోటీ అంతర్ధానమొందును. పోటీ లేకపోయినా ఇష్టమువచ్చినట్లు సరకులధరలు నిర్ణయించి అధిక లాభములు కొట్టవచ్చును. భిన్నభిన్న దేశములకు మధ్యపోటీ యున్నప్పుడు లాభములు అధికముగా క్షీణించును. అట్టి పరి స్థితులలో అధికలాభములు మిగుల్చుకొనుటకు అంతర్జాతీయ వ్యాపారిక పారిశ్రామిక సమూహములు స్థాపించుకొనవల సిన అవుసరములు గలుగుచున్నవి. మరియొక అవుసరము కూడ గలుగుచున్నది. ప్రతిదేశమును తన సరకులనే అధిక ముగా అమ్ముకొన చూచుచుండుటచే సరకు లమ్ముకొనుటకు "బజారులు" కావలసి వచ్చుటచే పారిశ్రామికదేశములు సమూహములుగానేర్పడి ప్రపంచమునంతను తమలోతాము పంచుకొనుటకుగూడ ప్రయత్నములు చేసినవి. సఫలమైనవి.

అంతర్జాతీయ సమూహాములచే యీ విషయముగూడ నిర్ణయింప బడినది.

ఒక సమూహాము మరియొక్క సమూహాముయొక్క క్షేత్రములో బాధలను కలిగించరాదు. ఎట్టివిరోధము చేయరాదు. మరియొక సమూహాముతో పోటీచేయరాదు.

తమలో తాము ఇట్టి సమస్త విషయములను గురించి ఆలోచించుటకును, ఒకరి సలహానొకరుగైకొనుటకును, భిన్న భిన్న దేశములను ఉచిత రీతిని తమలోతాము పంచుకొనుటకున్నూ, అంతర్జాతీయ ఆర్థిక వ్యాపారిక, సమూహాము లేర్పరుపబడుచున్నవి. ఇట్టిపనులు అప్పుడప్పుడు గుప్తముగా జరుగుటయు గలదు. వీటిలో కొన్నిటిపై వాదవివాదములు జరిగి కొన్ని వివాద విషయములను గుప్తముగా నుంచక ప్రకటన చేయుటచే సర్వసాధారణ ప్రజలకు సమూహా సభ్యుల యెడల అసంతోషము, అసహ్యము కలుగుట సంభవించును. అందుచే సమూహా సమాలోచనములు గుప్తముగా నుంచబడును. 1913సం॥లో బ్రుసెల్సునగరమునజరిగిన ఇనుము వుక్కు పరిశ్రమల సమూహాసమ్మేళనమునకు సుమారు 400 ప్రతినిధులు హాజరైరి. అందులో ఒకరికిగూడ సందేహములు తీర్చుకొనుట కవకాశము పూర్తిగా నిచ్చియుండలేదు. వారి పారిశ్రామికసమూహాములు స్థాపించినతరువాత వివిధపరిశ్రమల మధ్య స్పర్థయుండదని మన మిదివరకే గ్రహించియుంటిమి.

కాని అప్పుడప్పుడు ఇట్టి సమూహములకే వాటిలోవాటికి పోట్లాటలు గలుగుచుండును. ఇందువలననే ఒకదేశము, రెండవదేశమును గుర్తించుచూ పరస్పరహితములను మనస్సునందు ఇడుకొని సంధిమార్గముల నన్వేషించుచూ అంతర్జాతీయసమ్మేళనములను స్థాపించుకొనవలసి వచ్చుచున్నది. ఇట్టి సమ్మేళనములలో వాద వివాదానంతరము ఈ విషయము అంగీకరింపబడుచున్నది. ప్రపంచములోని ఏభాగము ఏవ్యాపారికసమూహముక్రిందనుండవలయును? వ్యాపారముఎన్నోవంతు ఏదేశ వ్యాపారమండలములకు వుండవలయును ? దేశములను పంచుకొనుటతోపాటు ఈసమ్మేళనములలోనే సరకుల ధరకూడ నిర్ణయింపబడును. ప్రతి సమూహము ఈనిర్ణీతమైన ధరలకన్నా హెచ్చుగాని,తగ్గుగాని,అమ్మకూడదు. ఏమియూ గూడ ఈ హద్దుల నుల్లంఘింపరాదు. 1904 సంవత్సరములో అంతర్జాతీయ రైళ్ల పరిశ్రమదారులసభ జరిగెను. అందు ప్రతిదేశమునకునూ ఈపరిశ్రమలో ఎంతభాగ ముండవలసినది నిర్ణయింపబడినది. రైళ్ళ సామాగ్రి తయారుచేసి విదేశములతో వ్యాపారముచేయుటకు బ్రిటనుకు నూటికి 53.5 పాళ్ల భాగమును జర్మనీకి 28.8 పాళ్లభాగమునూ, బెల్జియమునకు 17.7 పాళ్ళభాగమునూ, అంగీకరింపబడెను. ఆరుసంవత్సరములు జరిగినతరువాత బ్రిటనుకు 37% జర్మనీకి20%వ్యాపారమును జేయటకు అంగీకరింపబడెను. ఈమార్పుతో ఫ్రాన్సు

మొదలుగాగల దేశములుగూడ అంతర్జాతీయ, రైళ్ళసంఘములో చేరెను. అందుచే వ్యాపారముచేయుటకు ఒక్కొక్కవాటాకు తక్కినవాటాలు రావటం సాధారణవిషయమే. ఎందుకనమంది ఎక్కువ అయితే మజ్జిగ పలుచనయగును. దోపిడీగాళ్ళ సంఖ్యపెరిగిపోయిన దోపిడీవలనవచ్చులాభములు ఇదివరకన్నా తగ్గుట సంభవమే.

ఇట్లే 1909లో సత్తు, తుత్తునాగము, పరిశ్రమల అంతర్జాతీయ సమ్మేళనము స్థాపించబడెను. తుత్తునాగము సత్తు, వ్యాపారమంతయు బ్రిటన్, జర్మనీ, ఫ్రాన్సు, బెల్జియం స్పెయిన్ దేశములమధ్య పంచుకొనబడెను.

ఇట్లు అంతర్జాతీయసంఘములు ఏర్పడుటచే ప్రపంచములో స్థాయిభూతమైన శాంతి నెలకొల్పబడునని కొందరు గ్రంథకర్తలమతము. వారు ఇట్లు వాదించుచుందురు. "ఇట్లు సంఘములుండుటచే ప్రపంచపుమార్కెట్టులోవుండు పోటీ రద్దుఅగును. ఈపోటీచేతనే ఒకటి లేక రెండు అంతకంటే అధిక సంఖ్యగల దేశములమధ్య పోరాటము (సమరము) జరుగుట సంభవించును. ఈవాదము సహేతుకముకాదనియూ అసత్యమనియు కొంచెము ఆలోచించుటచే మనముగ్రహించగలుగుదుము.

పరిశ్రమలద్వారా అధికలాభములు సంపాదించుటకే అంతర్జాతీయ వ్యాపారికపారిశ్రామికసమూహములు ఏర్పడు

చున్నవి. పోటీ యుండినచో ఎవరికైనను యనేక కష్టములు పొందవలసి యుండుననిన్ని పోటీలేకపోయినవ్యాపారము సక్రమముగా జరిగి లాభములు వచ్చుననియూ కొద్దిలాభములకే పెద్దకష్టము లనుభవించకుండ చేయుటకును తమలోతాము పారిశ్రామిక దేశములు మార్కెట్టును పంచుకొనుచున్నది. అందుచే యీవిషయముమట్టుకు స్పష్టమని తేలుచున్నది. పరిశ్రమదారులలోను వ్యాపారస్తులలోను ఎంతవరకు లాభములను గడించవలయుననే ప్రవృత్తి ప్రకాశమానమై యుండునో ధనాఢ్యులవాదము కేవలము పూర్ణాధికారమునుపరిశ్రమలపై సంపాదించుకొనుటకు ఎంతకాలము తహతహలాడుచుందురో, అంతవరకు అంతర్జాతీయపారిశ్రామిక వ్యాపారిక సమూహములను స్థాపించుటవలన స్థాయిభూతమైన ప్రపంచములో ఏర్పడుతుందని ఆశించుట చాలా ఆశాభంగము. ప్రదేశము యొక్క వ్యాపారికసమూహాము ఇట్లు పూర్తిగాతలచుకుంటూ వుంది. "ప్రపంచములోని వ్యాపారము పరిశ్రమలు నాచేతులోనికివచ్చినచాలా బాగుండునురా". ఇట్టి దుర్గమ, దుర్భర, అసహ్యపరిస్థితుల్లో చిరకాల శాంతిప్రపంచములో ఇట్టిసమూహాములవలననే స్థాపింపజూచుట కుక్కతోకను సరిచేయ చూచుటే.

1910 వ సంవత్సరములో జరిగిన అంతర్జాతీయసమ్మేళనములో ఫ్రాన్సుకు రైళ్ళవిదేశవ్యాపారములో నూటికి

1. 5 పాళ్ళ భాగము నిచ్చిరి. 1912 లో ఫ్రాన్సు కొంచెము కయ్యమునకు కాలుదువ్వినప్పుడు, దాని భాగము యిదివరకు కన్న రెట్టింపు గావించిరి. కాని యింతటితో యినుముపరిశ్ర మల వాటాదారులకు సంతోషము కలుగలేదు. అందుచే ఫ్రాన్సువారు జర్మనీలోని "అల్సేస్‌లోరెన్" అను ప్రాంతమును వశపర్చుకొనుటకు ప్రయత్నము చేయుటకు కోరికను బయట బెట్టిరి. ఇనుము పరిశ్రమ దృష్టితో బరిశీలించిన ఆప్రదేశము మంచి ఫలవంతమైనది. అచ్చట పెద్దపెద్ద యినుపగనులు కొన్నిగలవు. ఐరోపా మహాయుద్ధమునకు ఫ్రెంచివాళ్లయొక్క యీ కోరిక యొక కారణము. యుద్ధానంతరము జరిగిన "వర్సలీసు" సంధి ప్రకారము ఫ్రాన్సు యీ ప్రదేశమునే జర్మనీక్రింద నష్టపరిహారము క్రింద దీసుకుని వశపరచుకున్నది.

"బ్యాగ్దాడ్" రైలు సంబంధములో జర్మనీ ప్రధానస్థాన మలంకరించినది. కాని అందు బెల్జియం, ఫ్రాన్సుకూడా భాగస్థులుగానుండి ఆ కంపెనీలో యేకమైపోయినవి. అంతర్జాతీయ పారిశ్రామిక, వ్యాపారిక సమూహాములు ప్రపంచ శాంతికి దోడ్పడుటయేగాక శాంతిభంగమునకు సహాయకారిణియగుచున్నావని యీ పై జెప్పినకంపెనీ యుదాహారణ వలన స్పష్టమగుచున్నది. ఈ సమూహాములవలననే అప్పుడప్పుడు పెద్ద సమరములుగూడ బయలుదేరుట గలదు.

మొరకోక్కోలో రైళ్ళు నిర్మించుటకున్నూ, గనులనుండి ఖనిజములు ద్రవ్వుటకున్నూ, తదితర ఫలవంతమైన కార్యములు చేయుటకున్నూ, ఫ్రాన్సు, జర్మనీ యేవ్యాపారిక సమూహముగా జేరినవో, దానివలన యీపై జెప్పిన విషయము బోధకమగుచున్నది. ఆ వ్యాపారములు ఫ్రాన్సు వ్యాపారస్థులకు నూటికి 62 పాళ్ళ భాగమున్నూ జర్మనీకి 20 పాళ్ళ భాగమున్నూ యివ్వబడెను. మొరకోక్కోయొక్క ఆర్థిక సంపదయంతయు తామే కొల్లగొట్టుకొనవలెనని ఫ్రాన్సు వాంఛించుచున్నది. తమ వ్యాపార భాగము అభివృద్ధి పొందవలయుననియు మొరకోక్కో ఆర్థిక ఆధారములపై తమపూర్ణాధికారముండవలె ననియు జర్మనీవారు కోరుచుండిరి. ఈప్రశ్నవలననే 1905లోను 1912 లోనువీటికిమధ్య యుద్ధమురావలసినదే, కానియెట్లో యుద్ధమునుండితప్పించుకొనిపోయినవి. మొరకోక్కోయొక్కఆర్థికసంపదను పంచుకొనుటలో ఫ్రాన్సుకు, జర్మనీలకు గలిగిన వైషమ్యము గతఅయిరోపా మహాయుద్ధమున కొకబలవంతమైన కారణము.

వర్తమాన సామ్రాజ్యవాదముయొక్క పంచమావస్థయిది. "పెద్దపెద్ద ధనాఢ్యదేశములమధ్య ప్రపంచ భూభాగమంతయు పూర్తిగా పంచుకొనబడినది". ఇదియే సామ్రాజ్యవాదముయొక్క చరమావస్థ.

19 వ శతాబ్దము ఆఖరు వరకు అయిదు సంవత్సరముల లోపల ప్రపంచములోని భిన్నభిన్న దేశములలోని యెంత యెంత భూభాగములు అయిరోపా ధనాఢ్య రాష్ట్రముల మధ్య పంచబడినవో క్రిందయివ్వబడిన అంకెలవలన దెలియ గలదు.

| | 1876 స॥లో | 1900 సం॥లో |
|---|---|---|
| ఆఫ్రికా | 10.8% | 90.4% |
| పాలీనేషియా | 56.8% | 98.9% |
| ఆస్ట్రేలియా | 100.% | 100.% |
| ఆశియా | 51.5% | 56.6% |
| అమెరికా | 27.5% | 27.2% |

19 వ శతాబ్ద మంతమొందుసరికి ప్రపంచములోని భూభాగము లన్నిటిని అయిరోపా దేశములు వశపరచుకొనిన వని పై యంకెలద్వారా స్పష్టమగుచున్నది. ఏషియా, అమెరి కాలలో, యెవరి యధికారంక్రింద నుండక బంజరులుగా వున్నట్లు గనబడు భూమియంతయూ వాస్తవమునకు, పూర్వము యేస్వతంత్ర రాజులక్రిందనో యుండెడిది. ఏ ధనాఢ్య దేశ ముల మధ్యనో, పంచబడకుండా బంజరుగా బడియుండిన భూమి 19 వ శతాబ్దాంతమున లేదనియే చెప్పవచ్చును. ఇప్పుడున్న ప్రశ్న యిదియే. ఒక దేశముక్రిందనున్న భూభాగమును మరియొక దేశము తన యధికారముక్రిందకు

లాగుకొనవలయునని ప్రయత్నించుటయే గొప్ప సమస్య మైపోయినది. రెండవదానిపై మూడవదేదైన వచ్చి ఆక్రమించుకొనుటకు నుద్యుక్తురాలై యున్నది. భూభాగములు కాంచుకొనుప్రశ్న 1900 సంవత్సరము వచ్చుసరికి సమాప్తమై పోయినది. ఇప్పటిప్రశ్న వున్న భూభాగములను యితరులు లాగుకొనకుండా సైన్యములతో రక్షించుకొనుటయే. అందుచేతనే ప్రతిదేశము వొకదానికన్న, మించి యొకటి ఆయుధములను గలిగియుండవలయునని ప్రయత్నించుచున్నవి. పైకి ఆయుధవిసర్జనసభలు జరుగుచున్నప్పటికిని లోపలిగుట్టు యెవరికిన్ని దెలియనివ్వరు. ఈ సామ్రాజ్యవాదావస్థలో ఆయుధ విసర్జనజేయుట, గాలిలో మేడలు కట్టుటయే. ధనాఢ్యుల వాదమే సైన్యముపై నాధారపడియుండినప్పుడు, ధనాఢ్య దేశములు ఆయుధ విసర్జన చేయునని దలచుట తన్నుజానే మోసబుచ్చుకొనుట. 50 సంవత్సరముల క్రిందట బ్రిటను, ఫ్రాన్సు, రష్యా దేశములు తప్ప, అన్యదేశముల కేటికి వుపనివేశముల స్థాపించు నవుసరమే లేకపోయినది. అటు తరువాత గూడ, ఆఫ్రికా, ఏషియాఖండాల లోని, భూభాగ్యములను, యుద్ధము జేయనిదే వశపరచుకొనుట అతికష్టమైనది. అందుచే స్వతంత్రరాజులను, పూర్తిగా నాశనముజేసి, వుపనివేశములను స్థాపించుకొనవలసి వచ్చెను. పెద్దరాష్ట్రముల మాటయటులుంచి, చిన్నరాష్ట్రములుగూడ

(ఇటలీ, బెల్జియం) ఆఫ్రికాలోని కొన్ని భూభాగములను వశపరచుకున్నవి. (బెల్జియం కాంగోప్రాంతమును; ఇటలీ, సుడాను, వుత్తరాఫ్రికానులో బట్టుచుకున్నవి.) కాని 20 వశతాబ్దము వచ్చుసరికి, యీస్థితి మారిపోయినది. ఇప్పుడు యుద్ధము చేయకుండయే ప్రదేశమును, వుపనివేశముగా జేసుకొనుట కష్టమైపోయెను. (ఐరోపా దేశములు అప్పటికి పారిశ్రామికాభివృద్ధి బాగుగా జరిగెను. అందుచేవాటికి సరకులమ్ముకొనుటకు, ఐరోపా ఖండములో, బజారులు దొరకకపోవుటచే అసభ్యదేశములను గొన్నింటిని, వశపరచుకుని అచ్చటవాటి ఫ్యాక్టరీ వస్తువులకు మార్కెట్టుల నేర్పరచుకొనుట అవుసరమైపోయెను. అందుచే మార్కెట్టు కొరకు నొకదేశముతో మరియొక దేశము పోట్లాడలసివచ్చెను.) అసభ్యదేశములలోని కొన్ని ప్రదేశములు అప్పటికి యుద్ధము చేయకుండగనే, వాటి వశమైనా అయిపోయినవి; లేక వాటి రక్షణక్రింద కైనా వచ్చినవి. అట్లు అయిరోపా దేశములకు అప్పటికి యెచ్చటనో వొకచోట కొంత భూభాగం వర్తకము చేసుకొనుటకు, దొరకెను. అట్టిపరిస్థితులలో, ఫ్రాన్సుగాని, జర్మనీగాని, ఏదోయొక భూభాగముపై అధికారము సంపాదించుటకు, ప్రయత్నించుచున్నప్పుడు, వాటికొరకో, (అనగా ఆప్రదేశముకొరకో) బ్రిటను మొదలుగాగల యితరరాష్ట్రములు తంటాలు పడవలసివచ్చును. (ఎందుచేతనగా, అట్టి

ప్రిదేశములను, ఏఫ్రాన్సుదేశమో, ఏజర్మనీయో, యేబ్రిటనో వశపరచుకొనిన తక్కిన దేశపు వాణిజ్యమునకన్న, అట్టిదేశము వాణిజ్యమును అభివృద్ధిజేసుకుని, పెద్దలాభములుసంపాదించి, ఆర్థికముగాను రాజకీయముగను, యితరరాష్ట్రముల కన్న, బలవత్తరముగా నుండును. ఆభయముచే నితరరాష్ట్రములు అట్టిరాష్ట్రి యొక్క-టే మార్కెట్టునంతా వశపర్చుకొననీయరు. అందుచే ఒకదేశమునకు, మరియొకదేశమునకు వైషమ్యములు గలిగి యుద్ధములు సంభవించును) బెల్జియం, హాలెండు చిన్న రాష్ట్రములన్ని వాటికిందనున్న వుపనివేశములను పెద్దరాష్ట్రి మేదైనయొకటి వశపరచుకొనుటకుభయపడుచుండును. ఆరాష్ట్ర ములు రెండేఅయిన చులకనగా ఓడించగలదు. కాని వాటికి సహాయార్థముపెద్దరాష్ట్రములు వాటివాటిసదుపాయములను బట్టి సహాయమొనర్చుచుండును. ఇట్లుసహాయముచేయుటలో నుద్దేశ్యము నీతిభారముగాదు. కేవలము అవి వాటిస్వార్థము కొరకే యుద్ధములోనికి దిగును. ఆయుద్ధములో వాటి స్వార్థము యంగీకరించు దేశములకు సహాయము చేయు చుండును. జర్మనీ, బెల్జియం, భూభాగమును కొంతవరకు వశపరచుకొనుటకు ప్రయత్నము చేయుచున్నప్పుడు ఫ్రాన్సు దేశము జర్మనీతో విరోధముపెట్టుకొని బెల్జియంకు సహాయ మొనర్చుచుండును. జర్మనీయొక్క అభివృద్ధి తనక్షేమమునకు భంగమని ఫ్రాన్సుతలంచుచు జర్మనీని ఎప్పుడును, నిరోధించు

చుండును. ఇఙ్లీస్ ఫ్రాన్సు, పోర్చుగల్ దేశములక్రింద వుప నివేశములను మ్రింగవేయవలెనని ప్రయత్నించిన పోర్చుగల్‌కు బ్రిటన్ సహాయ మొనర్చును. పోర్చుగల్‌కు సహాయము చేయుచు యుద్ధమునకు నుద్యుక్తురాలై యుండును.

యీ విధముగా లెనిన్ యభిప్రాయ ప్రకారము సామ్రాజ్యవాదము ధనాఢ్యవాదముయొక్క చరమావస్థ యని పరిగణింపబడుచున్నది. (1) ఫ్యాక్టరీలద్వారా మితిలేని వస్తుసముదాయము వుత్పత్తియగుటయు, ధనమంతయు నొక చోట ప్రోగగుట చేతను పరిశ్రమలపై సర్వాధికారము యే కొద్దిమంది ధనాఢ్యుల చేతులలోనికో పోయెను. (2) పరిశ్రమలలో బ్యాంకుధనము పెట్టుబడిపెట్ట మొదలిడినప్పుడు ఆర్థికప్రపంచములో నొకవిధమైన ధనిక నియంతృత్వ మేర్పడినది. (3) అప్పుడుధనముఇతర(విదేశ)దేశములకుఎగుమతిచేయుట యధికలాభదాయకమగుటచే విదేశములకు ధనము నెగుమతి చేయుట వృద్ధినొందెను. (4) ధనాఢ్యులందరు కలసి అంతర్జాతీయపారిశ్రామిక, వ్యాపారిక సమూహముల నేర్పరచుకొని తమ పూర్ణాధికారమును నలువైపుల వ్యాపింపచేసి ప్రపంచమును తమలోదాము పంచుకొనుట మొదలిడిరి. (5) పెద్దపెద్ద ధనాఢ్యదేశములమధ్య (బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీ, అమెరికా, జపాను) సమస్త ప్రపంచభూభాగములు పూర్తిగా పంచబడినవి.

ప్రస్తుతపు సామ్రాజ్యవాదమును గురించి చెప్పుచు "లెనిన్" వొకవిషయమును గూర్చి కూడ తెలియపర్చెను. అది ధనాఢ్యవాదముయొక్క ప్రతిఫలము. సామ్రాజ్య వాదము విస్తరించినకొలది యేకొద్దిమంది ధనాఢ్యులదగ్గరనో ధనమంతయు పోగైపోయినది. ముఖ్యమైన పారిశ్రామిక దేశములే అధికముగా రాజకీయబలమును, ఆర్థికసంపత్తిని గలిగియున్నవి. ఇట్టి రాష్ట్రములలో ఇట్టి ధనవర్గమొకటి యేర్పడినది. వారు వడ్డీవ్యాపారమువలన, కంపెనీవాటాల వలనవచ్చు లాభములవలన కష్టించకయే తమ జీవితమును సుఖముగా గడపుచున్నారు.

స ం పూ ర్ణ ము .





# కామ్రేడ్ డిమిట్రాఫ్

జర్మనీలో హిట్లరు రాజ్యం స్థాపించిన కొన్నిదినాలకి, నాజీప్రభుత్వం అచటి సభాభవనాని (రీచిస్టాగు) కి నిప్పు తగి లించారనే మిషతో ఒక కేసు కల్పించి పెట్టింది. ఆ కేసు "రీచిస్టాగు దహనం" అనే పేరుతో ప్రపంచంలో ప్రసిద్ధిజెం దింది. ఆకేసులోకి కమ్యూనిస్టు నాయకులు బలవంతంగా ఈడ్వబడ్డారు. అదేకేసులో కామ్రేడ్ డిమిట్రాఫ్‌కూడ తోయబడ్డాడు. అతని జీవితం, నిద్రపోయేవాళ్ళని మేలు కొలపడమేకాదు, కార్మికోద్యమంకొరకు, కార్మిక ప్రపంచం యొక్క మేలుకొరకు బలిదానపాఠం నేర్పుతుంది. ఇంతేకాదు శవాల్లో ఊపిరిపోస్తుం దతని జీవితం. ఎవడు, నిర్భయంగా కోర్టులో తన తరఫున ఒక పెద్దవాఙ్మూలం (స్టేటుమెంటు) ఇచ్చాడో, ఎవనిని అతని అనుచరులతోపాటు విడిచిపెట్టా లని ప్రపంచం అంతా తీవ్రనిరసనము వెలిబుచ్చిందో, చివరకు ఆ ఆందోళనా ఫలితంగా ఎవడు విముదలపొంది సోవియట్ రష్యాచేరి, ఫేసిస్టు దమననీతికి విరుద్ధంగా కార్మికులందరూ ఏకమై పోరాడవలెనని సందేశం ఇచ్చాడో, ఆ డిమిట్రాఫ్ నామం ప్రపంచమంతా మారుమ్రోగుతోంది.

## అడవి ఫేసిజమ్.

ఎవనిపేరు అంతర్రాష్ట్రీయ కార్మికోద్యమంలో ఇంత ప్రసిద్ధమయిందో, ఎవని విడుదలకై ప్రపంచ కార్మికులంతా తీవ్రనిరసనం వెలిబుచ్చారో ఆమహానుభావుడెవడు? ప్రెస్ కార్మికులకు అతడొక మామూలు కంపోజిటర్ అని తెలిసి నప్పుడు సంతోషంగాక ఆశ్చర్యంకూడ కల్గుతుంది. నిండు యౌవ్వనంలోనే అతడు ప్రెస్‌లో పనిచేస్తుండేవాడు. అప్పటి నుండే పూంజీవాదంయొక్క భయంకర స్వరూపాన్ని అతడు తెలిసికో మొదలుపెట్టాడు. అప్పటినుండే పూంజీవాదసంఘ ప్రణాళికను నాశనంజేయాలనే అభిప్రాయం హృదయంలో దృఢతరమవుతుండేది.

డిమిట్రాఫ్ బల్గేరియావాడు. ఆదేశపు రాజధాని అయిన సోఫియానగరంలో ప్రెస్‌లో కంపోజిటర్ పనిచేస్తుం డేవాడు. ఆ ప్రెస్‌లో అక్కడి పూంజీవాదుల మాడరేట్ పక్షం, "నారోడినీప్రావా" అనే దినపత్రికను ప్రకటిస్తుం డేది. బల్గేరియా యూరప్‌లోని నైరుతీ భాగంలోని బాల్కన్‌టాపూదేశం. అది ఇప్పుడుకూడ యూరప్‌లోని ఇతర రాజ్యాలకంటె వెనకబడివుంది. అయినా, అక్కడ పూంజీవాదం తల నెల్లా యెత్తుక తిరుగసాగిందో అట్లాగే కార్మికోద్యమంకూడా తనజండాను పాతింది. 'రిచిస్టాగు' కేసులో జర్మను నాజీ ప్రాసిక్యూటర్ బల్గేరియన్ నేరస్థులను 'అడవి మనుష్యుల'ని అవమానించగానే కామ్రేడ్ డిమిట్రాఫ్

ప్రాసిక్యూటరు మళ్ళా నోరెత్తకుండేటట్టు జవాబిచ్చాడు. ఆజవాబు యిది.

"మాదేశస్థులు ఇతర్లకుమల్లే సంపన్నులుకారు. కాని యెవరయినా, దాన్ని రాజనైతిక, బుద్ధి, మత, విషయాల్లో యితరదేశాలకంటె వెనుకబడి వుందని చెప్పితే అది బొత్తుగా అబద్ధం. తప్పు. ఇతర రాజ్యాలవాళ్ళవలెనే మారాజనైతికోద్యమంరొక్క వుద్దేశ్యంకూడ ఉన్నతమయిందే. అయిదు వందల సంవత్సరాలనుండి విదేశీయులు అధికారం చలాయిస్తున్నారు. అయినా మామాతృభాషను స్థిరపరచుకొనే యున్నాము. ఇప్పుడు మమ్మల్ని అడవిమనుష్యులని ఎవడనగలడు? ఫాసిస్టు దమననీతిసి నాశనం చేయాలని, కమ్యూనిష్టు సమాజాన్ని స్థాపించాలని మాదేశపు కర్షకకార్మికులు ప్రాణాల్ని పందెంవొడ్డి పోరాడుతున్నారు. ఇలాంటివాళ్ళని 'అడవిమనుష్యు లనగలరా? బల్గేరియాలోకూడ అడవిమనుష్యులున్నారు. వాళ్లెవరో తెలుసా? కార్మిక-కర్షకులపై అన్యాయం, అత్యాచారంచేసే పూంజీపతులు. కాని యిలాంటి అడవి మనుష్యులు లేనిదేశం ఏది? 'అడవి' అనే విశేషణం లేకుండా, ఏదేశపు ఫాసిస్టులకుకూడా శోభలేదు.

## సోఫియాలో "మే" దినము.

సోఫియానగరంలో 1898 లో మొట్టమొదట మే దినం జరుపబడింది. పట్టణంలో పెద్దపెద్ద కార్మికోత్సవాలు జరిగాయి. అనేకచోట్ల వాళ్లకూ పోలీసులకూ పోరాటాలు

జరిగినై. మెజిస్ట్రేటు ఉత్సవానికి విరుద్ధంగా నిషేధపుటుత్తరువు గావించాడు. అచట పూంజీవాదులకు 'మే' దిన మహాత్వం బాగా తెలుసు. కారణం? సమస్త ప్రపంచ కార్మికులు ఆరోజున తమ యుద్ధ సైనికత్వాన్ని (మిలిటరీ) సోల్డరిటీ)ని ప్రదర్శిస్తారు. కార్మికులు తమ బలాన్ని ప్రపంచానికి పరిచయంచేయడానికి పూంజీవాదులు ఎప్పుడూ అంగీకరింపరు. అందుచేతనే ఆ అన్యాయపు ఆర్డరు జారీ గావింపబడింది. కాని కార్మికులు దీనిని లెక్కచేయడంలేదు. పోలీసువాళ్ల కఠినమైన తుపాకీగుండ్లకు కార్మికుల వైపునుండి ఇటుకరాళ్లు జవాబిచ్చినయి. వేలకొలది కార్మికులు గాయపడ్డారు. సోఫియా వీధుల్లో రక్తం కాలువలై పారింది. విప్లవకర శ్రేణీయుద్ధానుభవము (క్లాస్ స్ట్రగుల్) బల్గేరియన్ కార్మికులకు ప్రాప్తించింది. సోఫియాలో మేదినం యొక్క మొదటి విజయం పూంజీవాదులకు గంగిర్లెత్తించింది.

మరుసటి దినం "నరోడినీప్రావో" పత్రికా సంపాదకుడు "శేషోస్లావోవ్" మే దినముకు వ్యతిరేకంగా సంపాదకీయ వ్యాసంలో క్రోధాగ్నిని కక్కదలచుకొన్నాడు. ఆ విధంగానే సంపాదకీయ వ్యాసాన్ని తయారు గావించాడు. ప్రభుత్వానికి విరుద్ధంగా తలపెట్టిన ఉద్యమానికి కారకులైన కార్మికులపై మొదటినుంచి చివఱవఱకు తిట్లే తిట్లు గురిపించాడు. "పిల్ల ధూర్తులు! దొంగలు!! దోపిడిగాండ్రు!!! వీళ్ళకి రాజకీయవిషయాలేం తెలుసు? ఈ బద్మాషులకు అధికారులపైని గడ్డలు విసరటానికి సాహసం ఎట్లా గల్గింది?

ఈ ఉద్యమం ఇప్పుడంతం గావించకపోతే ఇతరదేశాల ఎర్ర జండాల బలం పెరిగినట్టే, మనదేశంలోకూడా వృద్ధి పొందు తుంది. తర్వాత దాన్ని ఆపదలచినా ఆగదు." అని వ్రాశాడు ఆ డాక్టర్ రోడోస్లాహొవ్లు దాన్లో.

కంపోజిటర్ల సమ్మె.

ఆ వ్యాసం కంపోజ్ చేయడానికి, స్వతంత్రుడైన డిమి ట్రాఫ్‌వద్దకు తీసుకరాబడింది. రెండు మూడు బంతులు కంపోజ్ చేశాక డిమిట్రాఫ్ ఆ వ్యాసంయొక్క ఉద్దేశ్యం గ్రహించాడు. క్రోధంతో మండిపడి, అతడు ఫోర్‌మెన్ దగ్గరకెళ్లి స్పష్టంగా, "నేను దీనిని కంపోజ్ చేయజాలను" అని చెప్పివేశాడు.

"కంపోజు చేయలేవూ? దానిలో కష్టమేముంది?" అని ప్రశ్నించాడు ఫోర్‌మెన్. "ఈ వ్యాసంలో డాక్టరు రోడోస్లాహొవ్ల్ అన్నీ అబద్ధాలు వ్రాశాడు. కార్మికులను నిందించి తిట్టాడు" అని డిమిట్రాఫ్ జవాబు. 'యీ విష యం నీదికాదు. తక్కిన కంపోజంతా తయారయింది. సం పాదకీయవ్యాసం మాత్రం మిగిలివుంది. తక్షణం తయారు చెయ్. లేనిచో పత్రిక వెలువడడం చాలా ఆలస్య మవు తుంది" అన్నాడు ఫోర్‌మెన్.

కాని పారవేసిన కాగితాన్ని తాకనైనా తాకలేదు డిమిట్రాఫ్. రోడోస్లాహొవ్ల్‌గారి గజిబిజ వ్రాతను చదువ

గల్లే కంపోజిటర్లు ఇద్దరు మాత్రం వున్నారు. వారిలో ఒకడు సెలవుమీద 15 రోజుల క్రితమే వెళ్లిపోయాడు. ఇక పని చేయగలవాడు డిమిట్రాఫ్ ఒక్కడు మాత్రం వున్నాడు. కొంచెం సేపట్లో తెల్లారుతుంది. కాని పత్రిక వెలువడేలకు కాలేం లేవు.

స్వయంగా సంపాదకుడే ప్రెస్‌లోకి దయచేశాడు. డిమిట్రాఫ్‌ని ఆఫీసులోకి పిలిచాడు కోపంతో మండిపోతూ. బిగ్గరగా గర్జిస్తూ సంపాదకమహాశయు డిట్లా అన్నాడు. "ఏమోయ్! ఇక్కడ నీవు యిలాంటి దుర్మార్గం కన్పరుస్తున్నావు? నీవు మా నౌకరువి. మేము నీకు కూలినిస్తున్నాం. మా యిష్టంవచ్చింది మేం వ్రాస్తుంటాం. దీనిలో నిన్ను తప్పులు వెదకమన్న దెవరు? కంపోజిటర్ పని టైపుకూర్చడమే. కాని సంపాదక వ్యాసాలపై టీకా టిప్పణాలుచేయడం యిక్కడే క్రొత్తగా కన్పడుతుంది. ఇక్కడ యిలాంటి ఆటలు సాగవు. నడు విక్కడనుండి. ఇప్పుడే పనిలోనుండి తీసివేస్తున్నా".

డిమిటాృిఫ్ ఇల్లా యిచ్చాడు జవాబు. "నేను కంపోజిటరునని నాకు బాగా తెలుసు. మీకుగూడా, నాకు కంపోజింగ్‌పని బాగావచ్చునని బాగా తెలుసు. నేటివఱకు కార్మికులకు విరుద్ధంగా వ్రాసే తుచ్ఛతుచ్ఛ వ్యాసాల్ని నా దురదృష్టంచే కంపోజు చేస్తున్నా. కాని నే డా దుర్గంధానికి హద్దు ఏర్పడింది. నాబోటివాడు మీ వ్యాసాన్ని కంపోజ్ చేయడం అసంభవం. మరియొక కంపోజిటర్ దొరికితే సం

తోషంగా అతనికీయండి. కాని మరొక కంపోజిటర్ దొరకుతాడని నేను తలవను. మంచిది. ఈ బానిస వెళ్ళుతున్నాడు" అంటూనే — అటనుండి, కోటువేసుకుంటానికి డిమిట్రాఫ్ కదలిపోయాడు. ఫోర్‌మెన్ మళ్ళా బోధించటానికి ప్రయత్నించాడు. కాని అతని ప్రయత్నాలన్నీ వృథా అయిపోయినై. ఫోర్‌మెన్ యితర కంపోజిటర్లను అవ్యాసం కంపోజ్ చేయమని అడిగాడు. కాని ఎవరూ కంపోజ్ చేయడానికి తయారు గాలేదు. పాపం ఫోర్‌మెన్ స్వయంగా తన చేతిలోకి స్టిక్ తీసుకొన్నాడు. కాని వ్యాసంలో ఒక అక్షరమైనా అతడు కంపోజ్ చేయగల్గితే ఒట్టు. ఆ తర్వాత చదవడమే దుర్లభంకద.

## కార్మికవిజయం.

సంపాదక మహాశయుడు కంపోజింగుచేసే భాగానికి విచ్చేశాడు. అప్పుడే డిమిట్రాఫ్ వెళ్లబోతున్నాడు. కొంచెం మెత్తబడి సంపాదకమహాశయుడు "తమ్ముడూ, ఇంతకూ నీవు చెప్పేదేంటి? ఈ విధంగా బుద్ధి నెందుకు చెడగొట్టుకుంటావు? నేను నాజీవితంలో నౌకరి నోటినుండి ఇట్టి మాటలు వినలేదు. పద. ఆఫీసుకు పద." అన్నాడు.

ఆఫీసులోనికిపోయి డిమిట్రాఫ్ యిట్లా చెప్పాడు. "మేము ధూర్తులంగాము. బద్మాషులమూగాము. కార్మికులము."

"నిజం. నీవు చాలా మంచి పనివాడవని నే నెఱుగుదును. నీవిషయమై నేను నేటివరకు ప్రేమతోనే వ్యవహరించాను. ఈ లిస్టు నిన్నకాదు. తక్కిన కార్మికులంతా నీవలెనే సత్యవంతులా యేంటి. నిన్నటి ఉపద్రవమైన కార్యాలలో భాగం తీసుకున్నవాళ్లంతా ధూర్తులుకారా?" అని ప్రశ్నించాడు డాక్టరు రోడోస్లాహాల్వేల్. డిమిట్రాఫ్ జవాబు "కార్మికులు సత్యవంతులు. ముఖ్యంగా నిన్న ఉత్సవంలో పాల్గొన్నవాళ్లంతా కార్మికులే. ఆ సమూహం అంతా మేల్కొన్న కార్మిక జనం. మా రక్తం పీల్చే పూంజీపతులకు విరుద్ధంగా పోట్లాడే కార్మికవర్గం. వాళ్లని ధూర్తులంటే నేను సహించను. స్వచ్ఛమైన కార్మికు డిలాంటి వ్యాసాన్ని కంపోజ్ చేయలేడు."

పెద్ద నిట్టూర్పు విడుస్తూ సంపాదకమహాశయుడు "సోదరా దానిలో తీసివేయాలిసిం దేమిటో చెప్పు." అన్నాడు.

డిమిట్రాఫ్ చెప్పినట్టుగానే ఆ వ్యాసం సవరింపబడింది. ఆరోజు పత్రిక సకాలమునకు వెలువడగల్గింది.

ప్రతి శ్రామికుడూ యిలాగే తిరుగుబాటు చేస్తే....



౧

## ౨

17 సంవత్సరాల తర్వాత చరిత్ర ఇది. 1915 వ సంవత్సరం మహాయుద్ధాగ్ని ప్రపంచాన్నంతా ముట్టుకుంది. బల్గేరియా పూంజీవాదులు జర్మను పూంజీవాదుల తరఫున పోట్లాడుతున్నారు. ఇతర రాజ్యాల లోవలెనే బల్గేరియా లోకూడా అచటి ప్రభుత్వం ద్వారా పత్రికలపై వెలువడిన అనేక ప్రతిబంధక చట్టాలు, పూంజీవాద ప్రభుత్వంయొక్క అత్యాచారాలూ ఎప్పుడూ ఘోరంగానే ఉంటాయి. ఇట్టి సమయములలో "దేశసేవకై సహాయం చేయండి. దేశానికి యుద్ధంవల్ల తిప్పలు వచ్చినాయి. ఇప్పుడు మన దేశ సోదరులకు (పూంజీవాదులకు) సహాయం చేయండి. ఇదే మన ధర్మ" మనే వాళ్ళలో డిమిట్రాఫ్ లేడు. మార్క్సువాదమును బాగుగా శిక్షణమందిన డిమిట్రాఫ్ మేల్కొన్న కార్మికుడు. విప్లవ కార్మికులు పూంజీవాద పార్లమెంటును ఎట్లాఉపయోగించుకుంటారో, రషియాలోని బోల్షివిక్కులను ఉదాహరణంగా తీసుకొని అమలులోపెట్టాడు. వ్యతిరేకంగా యుద్ధంచేసి సర్వియాసైనికుల్ని, బల్గేరియా సైన్యం ఖైదుచేసి, క్రూరంగా చిత్రవధ గావించింది. డిమిట్రాఫ్ దీనిని పార్లమెంటులో నిందించాడు.

ఆ సమయాన డిమిట్రాఫ్ మొదటి యజమాని డాక్టరు రోడొస్లావోవ్ ప్రధానమంత్రి పదవిలో వున్నా

డు. తన ప్రాత నౌకరుమాటలకు మండిపడి ఆయన "నీవు సర్వియనులకు దాస్యం చేస్తున్నావు. నీపెండ్లాం సర్వియన్ స్త్రీ. నీవు దేశద్రోహివి. శతృరాష్ట్రాలలోని వాడివి" అని నిందించాడు. అందుకు డిమిట్రాఫ్ ఇలా జవాబిచ్చాడు. "నాభార్య సర్వియన్ స్త్రీ అంటానికి నేనభిమానిస్తున్నా. కాని నేనీ విషయము ఇలాంటి నాస్వంత వ్యవహారాల్లోకై ఉద్దేశించి పలకలేను. మాపార్టీ చెప్పేదేమంటే రెండు దేశాలలోని కర్షకకార్మికులు సోదరుల లాగా ఉండాలని. మా సిద్ధాంతం ప్రపంచ కార్మికులంతా బలవంతులు కావాలని. ఇందుచేత ఈ నిరుపేద సర్వియన్ జనానికి మీరుచేసే బాధలను జూచి నేను నిందించుతున్నా. విరోధించుతున్నా."

## ముద్రణా స్వాతంత్ర్యం.

తర్వాత ప్రభుత్వంద్వారా ముద్రణా స్వాతంత్ర్యానికి కల్పింపబడ్డ నిర్బంధాలకు విరుద్ధంగా డిమిట్రాఫ్ ఉపన్యాసం ఇచ్చాడు. వెంటనే రోడోస్లావాఫ్ లేచి అరచి చెప్పసాగా డిట్లా.

"తమరు ముద్రణా స్వాతంత్ర్య నిరోధంపట్ల విరోధించడం ఆశ్చర్యమైనమాట. 17 సంవత్సరాలక్రిందటి మాట మరచిపోయారు కాబోలు. ఆసమయాన తమరు నాప్రెస్సులో నౌకరుగా వున్నారు. అప్పుడు నాకు సెన్సర్ లా చూపించారు. ఆవ్యాసం నేను ఉపసంహారించు కొంటానికి

నన్ను బలవంత పెట్టారు. అదే సెన్సర్ షిప్ కు, విరుద్ధంగా ఏముఖంతో మొఱపెట్టుకొంటున్నారండి?"

"అవును ఆసమయాన నేను తమ వ్యాసాన్ని "సెన్సరు" చేసినమాట నిజమే. నేను అది రక్తం, చెమటోడ్చే ప్రజల హితానికై చేశాను. ఆసమయంలో కార్మిక జనుల నోళ్లను కట్టివేయడం తమరి తలంపు. దానికి వ్యతిరేకంగా నేను పోట్లాడేను. ఇప్పుడూ ఆకార్మిక జనం నోరు కట్టివేసే చట్టానికె విరుద్ధంగా పోట్లాడుతున్నా."

1898వ సంవత్సరంలో మే దినాన 17సంవత్సరాలవరకు రోడోస్లావోవ్ కు నోటిదురదగల్గించేటంత బలవంతమైన గాయాన్ని, పూంజీవాద పరిభుత్వానికి డిమిట్రాఫ్ కల్గించాడు.

## హిట్లరు ప్రభుత్వపు ముట్టడి.

మహాయుద్ధానంతరం బల్గేరియాలో కమ్యూనిస్టుదళం స్థాపింపబడింది. దాని వ్యవహారమంతా కామ్రేడ్ డిమిట్రాఫ్ చేతిలో బడింది. 1923లో కమ్యూనిష్టు పార్టీ నాయకత్వంక్రింద కార్మిక కర్షకులు సోవియట్ విప్లవపతాకాన్ని ఎగురవైచారు. ఈ సశస్త్ర విప్లవాన్ని అచటి పూంజీవాద ప్రభుత్వం బహుక్రూరంగా అణగగొట్టి వేలకొలది కార్మికులను సర్వసాధారణహత్య గావించారు. అప్పటినుండి కమ్యూనిష్టు పార్టీ గూఢంగా పనిచేయడం సాగించిం

డి. పరిశీలిస్తే అచటి పార్టీబలం నేడు చాలాఅధికంగా కన్పిస్తూంది. ఈవిధమైన గూఢ కార్యక్రమంలో డిమిట్రాఫ్, ఇంకాకొంతమంది కమ్యూనిష్టుసోదరులూ విదేశాలు వెళ్ళవలసి వచ్చింది. వాళ్ళు జర్మనీలో ఉండగా హిట్లరు ప్రభుత్వం 1933 ఫిబ్రవరిలో అరెష్టుచేసి వారిపై రిచిస్టాగు దహననేరం మోపింది. ఈ అరెష్టువార్తలు సమస్త ప్రపంచాన వ్యాపించి పోయినయి. ఇతర దేశాల్లో ఈ నిర్బంధాలను నిందించుతూ తీర్మానాలు చేశారు. ప్రపంచమంతా తీవ్రంగా చూచినందుకు ఫలంగా హిట్లరు ప్రభుత్వం బలవంతంగా డిమిట్రాఫ్ మొదలయినవాళ్ళు నిర్దోషులని ఒప్పుకోవలసి వచ్చింది.

విడుదలయాక ఎక్కడికి వెళ్ళాలా అని డిమిట్రాఫ్‌ను వోసమస్య ఎదురొక్కంది. హిట్లరు అతని రాజ్యాన్నుండి వెళ్ళిపొమ్మన్నాడు. బల్గేరియా ప్రభుత్వం తమరాజ్యంలోనికతన్ని దూరనీయదు. చివరకు రష్యా సోవియట్ ప్రభుత్వము ఈ వీర కార్మికునికి తన దేశం తరఫున స్వాగతంబిచ్చి అతనికి సమస్త పౌరహక్కులు ఇచ్చివేసింది. ఇప్పుడతడు మాస్కోలో తన ముసలి తల్లితో సుఖంగా కాలము గడుపుతున్నాడు.

## కోర్టులో వాజ్మూలము.

రిచిస్టాగు నేరంలో కామ్రేడ్ డిమిట్రాఫ్ వాజ్మూల రూపకంగా యిచ్చిన ఉపన్యాసం, కార్మికోద్యమ చరిత్రలో

ఒక మహత్వపూర్ణమైనటువంటి ఘటన. అన్యాయపు హిట్లరు కక్షపూరితమైన పూంజీవాద న్యాయాధీశుల్నీ, ఖడ్గాలతో నడుంపై చేయివేసికొని నిలబడివున్న భటుల్నీ, లెక్కచేయకుండ, డిమిట్రాఫ్ తన వాఙ్మూలాన్ని కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతాల యొక్క ప్రతి అక్షరాన్ని విశదపరచి సమర్థిస్తూ, ఫాసిస్టు పూంజీవాదాన్ని పాపకరమైనదని సిద్ధాంతపరిచాడు. డిమిట్రాఫ్ వాఙ్మూలమంటే, విప్లవకార్మికుడు పూంజీవాదుల కోర్టులో, ఎలా ప్రసంగించాడో, తెలిపే పాఠమన్నమాట. డిమిట్రాఫ్ తన వాఙ్మూలం ఇలా ప్రారంభించాడు.

"ఈ కేసులోకి నేనూ, నా సహచరులూ, అన్యాయంగా నేరం మోపబడి లాగబడ్డాం. ఇందుచేత ఈ నేరానికి విరుద్ధంగా, మమ్మల రక్షించుకోనడం, మా కర్తవ్యం అని అనుకొంటాను. మాతరఫున వ్యాజ్యం నడిపించడానికి యిచ్చిన వకీళ్ళ జాబితాను, ప్రభుత్వం మంజూరు చేయలేదు. ఇప్పుడు నాకోసరం ఒక నాజీదళపు వకీలుని నిలబెట్టారు. ఇట్టి వకీలుద్వారా వెల్లడింపబడ్డ వాదవివాదాల్ని అంగీకరించి, నన్ను నే నవమానించుకోవడంకంటె ఉరికంబంపైన వ్రేలాడడం నాకు సంతోషం. ఇందుకని నా రక్షణ కోసం నేనే నిలబడివున్నాను."

డిమిట్రాఫ్ నోటినుండి యీ మాటలు రాగానే న్యాయాధీశునికి కోపంగల్గి 'ఇలాంటి ఛిద్రాన్వేషణం చేయబోకు!' అని గద్దించి పల్కేడు. కాని డిమిట్రాఫ్ యిలా

జవాబు చెప్పాడు. 'నానాలుక కొంచెం కటువయినదని వొప్పుకుంటాను. నావయస్సంతా ఈకటుత్వము యొక్క అనుభవంతోనే గడిచిపోయింది. ఇంతవరకూ నేను అనేక భయంకర సమస్యలతో పోటీ చేయవలసి వచ్చింది. అం దుచే ఈమాటలు తమకు కటువుగాతోస్తే అందులో నాతప్పే ముంది? నేనభ్యాసం గల వకీలునుగాను. నేను నారాచ కీయ సన్మానరక్షణ కోసరం నిలబడ్డాను. నానోటినుండి వెలువడే ప్రతిశబ్దం, నా నరనరమందు, నిండివున్న, పూం జీవాదానికి విరుద్ధమైన క్రోధస్వరూప మని అనటంలో అణు మాత్రం సందేహంలేదు. నాదృష్టిలో కమ్యూనిష్టు ఇం టర్ నేషనల్ యొక్క ప్రోగ్రాం, సత్యమైన చట్టం అనీ, కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ అధికారం సత్యమైన కోర్టు లనీ, నాఅభియోగం నడిపించడానికి తమరు అసమర్థులనీ, నే నెరుగుదును. అయినప్పటికీ, యదార్థమును చాల గంభీరం గా వెల్లడించుతా. రిచిస్టాగుకు నిప్పంటించడంలో నాకు గాని, టోర్గలర్, పోపోవ్, టెనెవ్వా ఆదిగాగలవాళ్లెవళ్లకీ సంబంధంలేదు."

దీనితర్వాత తన వాఙ్మూలం దృఢపరచుకోనేందుకు, సాక్ష్యానికి బదులు తన పరిచయాన్ని చూపాడు. కమ్యూ నిస్టులను ఎలాగైనా శిక్షించడానికె వాళ్ళపైన ఎట్టెట్టి కృత్రి మ అసత్యనేరాలు మోపారో, ఎన్నో ఉదాహరణాలతో, అవన్నీ తేట తెల్లంగా చూపించాడు. కొంతకాలానికి పూర్వం జర్మనీలో ఒక దుర్ఘటన సంభవించి రైలు తలకిం

దయింది. ఆపని కమ్యూనిస్టులే చేశారని గగ్గోలు పుట్టింది. కాని కొంతకాలానికి "మయిష్కా" అనే పిచ్చివాడు ఈనేరానికి బాధ్యుడని తెలిసింది. ఫ్రాన్సు రాష్ట్రపతిని హత్యచేసింది, రష్యాదేశపు "గోర్గులోఫ్వ్ "అనేవాడు. ఈ హత్యలో కమ్యూనిస్టుల ప్రోద్బలం వుందని పూంజీవాద పత్రికలు ప్రపంచం అంతా గగ్గోలుపెట్టినవి. కాని తర్వాత "గోర్గులోఫ్వ్" రష్యానుంచి పారిపోయివచ్చిన పూంజీవాదుల ఒక చేయి అని రుజువయింది. బల్గేరియాలోని సోఫియా నగరంలోని ఒక గొప్ప భవనానికి నిప్పు అంటించబడినది. దీనికిగూడ కమ్యూనిస్టుల తలపై నేరంరుద్ది, వేలకొలది కర్షక కార్మికులను వధగావించారు. కాని ఇది పోలీసువాళ్ళు చేసిన పనే.

## విప్లవం యొక్క ఎత్తులు.

డిమిట్రాఫ్ చెప్పిన ఈ వుదాహరణలకు న్యాయాధీశుడు మరింత వులికిపడి అతన్ని ఉపన్యాసం పూర్తి చేయమని చెప్పాడు. కాని డిమిట్రాఫ్ అంతటితో ఆగలా. 1933 ప్రారంభంలో జర్మనీ ఎలాంటి పరిస్థితులలోవుందీ, ఆ పరిస్థితులలో కమ్యూనిస్టు పార్టీ ఎలాంటి అందమైన అధికారం చలాయించింది, దానియొక్క క్రమపరిచయము డిమిట్రాఫ్ వర్ణించాడు.

" 1933 ఫిబ్రవరినుండే, జర్మనీలో కమ్యూనిస్టుపార్టీ త్వరలోనే న్యాయవిరుద్ధం (unlawful) అని ప్రకటింపబడే

చిహ్నాలు కన్పడుతున్నాయి. కమ్యూనిస్టు పత్రికలు ఆప బడినవి. కమ్యూనిస్టుపార్టీకి, తమ భవిష్యద్దశ శుభ్రంగా కన్పడుతూంది. జర్మను కమ్యూనిస్టుపార్టీ, ఇతరరాజ్యాల లోని కమ్యూనిస్టు పార్టీలు, న్యాయవిరుద్ధములని ప్రకటింప బడ్డప్పుడు, తమవ్యాపారం, త్వరగా ఎలా సాగించుకోనాలో బాగా ఎరిగేవుంది. బల్గేరియన్ కమ్యూనిస్టు పార్టీలోని నా అనుభవం బాగా వర్ణిస్తాను. అక్కడ కమ్యూనిస్టుపార్టీ ఎంత త్వరగా లేచిందో, అంతత్వరగానే న్యాయవిరుద్ధం(అన్‌లాఫుల్) అని ప్రకటింపబడింది. అయినా, అది తన జీవం నిలబెట్టు కొంది. నిలబెట్టుకోవడంలో కార్మికుల బలు లభ్యించింది. ఆసమయంలో బయటనున్నపార్టీ, నేటి గూఢమైనపార్టీకంటె ఎక్కువ శక్తివంతమయింది. రష్యాపార్టీ గూఢంగా వుంది. దాని మెంబరుల గౌరవం నాశనం చేయబడుచుండేది. అయినా అచ్చటపార్టీ, సమస్త కార్మికవర్గాన్ని, తమ జండా క్రిందకు లాగి విప్లవాగ్నిని సఫలత కావించింది. పార్టీ న్యాయ విరుద్ధం (అన్‌లాఫుల్) గావింపబడింది. అప్పుడు రష్యా కమ్యూనిస్టుపార్టీ 'ఇకముందు కొంచెమైనా పనిచేయడం అసంభవం' అని చెప్పలేదు. మరి యేరాజ్యంలోని కమ్యూనిస్టులు గూడ ఇట్లా చెప్పలేం. జర్మనుపార్టీ న్యాయవిరుద్ధం గావింపబడుతుందని, బాగానే తెలిసికొనివుంది. అప్పుడు కూడా "ఇప్పుడే యేదోవిధంగా విప్లవం స్థాపిద్దాం. లేక పోతే అంతా విధ్వంసం అయిపోతుంది. ముందేమీ కాజాలదు" అని కూడ చెప్పలేదు. న్యాయవిరుద్ధమని ప్రకటింప బడిన సమయంలో, పార్టీయొక్క విభిన్న అంగాలద్వారా

సరియైన పనిచేసే వ్యవహారం చూడడమే, ముందు జరగాల్సిన కార్యం. జర్మను కమ్యూనిస్టు పార్టీ, కమ్యూనిస్టు యింటర్ నేషనల్‌లో ఒక భాగం. కమ్యూనిస్టు యింటర్ నేషనల్ అంటే ఏంటి? కమ్యూనిస్టు యింటర్ నేషనల్ అంటే, వివిధదేశాల కమ్యూనిస్టు పార్టీల సంయుక్త సంస్థ. కమ్యూనిస్టు యింటర్ నేషనల్ అంటే, సమస్త ప్రపంచం యొక్క కమ్యూనిస్టు పార్టీ. కమ్యూనిస్టు యింటర్ నేషనల్ అంటే సమస్త ప్రపంచ కార్మికోద్యమాన్ని నడిపే సంస్థ. కార్మికులను పోగుచేసి, కమ్యూనిజంయొక్క ఉద్దేశ్యంకొరకు పోరాడే సంస్థ. ఇందుకని సమస్త ప్రపంచంలో కార్మిక కర్షకరాజ్యం స్థాపించడం, సోషలిస్టు, సోవియట్ రిపబ్లిక్ ఫెడరేషన్ స్థాపించడం, సంఘరాజ్యం యిలాస్థాపించి, కమ్యూనిస్టు పరిణామికయొక్క మొదటి మెట్టును పూర్తిగావించడం. యిన్నిమాటలెందుకు? కర్షక కార్మికులను తమవైపుకు లాగుకొనడమే, కమ్యూనిస్టు యింటర్ నేషనల్‌యొక్క ఉద్దేశ్యం, ధ్యేయం. అది ఈ ఉద్దేశ్యంకొఱకే పోట్లాడుతుంది. ఇందుచేత కమ్యూనిస్టు పార్టీ, రాజద్రోహవిప్లవాన్ని, పిల్లల ఆటని, అనుకోదు. 1933 ఫిబ్రవరిలో జర్మను కమ్యూనిస్టు పార్టీకి తిరుగబడవలెననే ప్రశ్నలేదు. ఆ సమయంలో వారి యెదుటనున్న సమస్యలివి.

"దమననీతిని ఏవిధంగా పోటీచెయ్యాలి? కార్మికవర్గంస్థల్ని ఏవిధంగా రక్షించాలి?" ఈసమస్యల్ని ముందుంచు

కొనే, జర్మను కమ్యూనిస్టు ఎక్జిక్యూటివ్ కమిటీ తన యెత్తులను (Tactics) తయారుచేసింది.

“ఇపుడు రాజద్రోహం ప్రారంభమయింది. దానికి సిగ్నల్ రీచిస్టాగుకు నిప్పు అంటించ బడింది” అని జర్మను కమ్యూనిస్టులపై ఆరోపింపబడ్డ అసత్యానిందల్ని డిమిట్రాఫ్ తుడిచివేసి, కమ్యూనిస్టు అభియుక్తుల్ని విడిచి పెట్టాలనీ, వారికి గలిగిన నష్టానికి ప్రతీకారం ఇప్పించాలనీ, అసలు దోషులపైని అభియోగం నడిపించాలనీ, న్యాయాధీశుని అడిగాడు. అసలు నేరస్థులు హిట్లరుచేతిలోని కీలుబొమ్మలు. కమ్యూనిస్టులుగాదు. హిట్లరుచేతిలో కీలుబొమ్మలయిన, నాజీదళపు కెప్టెన్, “గోరింగ్” డాక్టరు “గోయిబల్సులు” నేరస్థులు. వీరు గొప్పఅపరాధంచేసికూడా లోకప్రియులు కావడానికి, బడాయిలు కొట్టుతుండేవాళ్ళు. ఫాసిస్టుప్రాంజీ పతుల సహాయులమని తమంతకుతామే చెప్పుకొనేవాళ్ళు. ఈ మహానుభావు లొనర్చిన కార్యం చేతనే, బయటనుండి వచ్చి నివసించు కమ్యూనిస్టులు, అసలు జర్మను నాగరిక కమ్యూనిస్టులు, వేలకొలదిగ బాధలనుభవింపవలసి వచ్చింది.

ఇట్టిస్థితిలోనే డిశంబరు నాల్గో తారీఖునకు ప్యారిస్ నుండి పంపబడ్డ రూటర్ తంతివార్త యొకటి, హిందూదేశపు పత్రికలలో ప్రకటింపబడింది. దానిలో ఇట్లా వ్రాయబడి వుంది. “ఫ్రాన్సు పత్రిక ‘లా జర్నల్’ రీచిస్టాగుదహన విషయమై ఒక లేఖ ప్రకటించింది. అది అత్యంత భేదయుత

మయిందేగాని మహాత్వపూర్ణమయింది. అది చేవ్రాళ్లతో కూడ ప్రకటింపబడింది. ఆలేఖను తుఫాన్ సైన్యపు 'కారల్ అర్నెస్టు' వ్రాశాడు. దాన్ని స్వీడన్ డాక్టర్, 'బేరింగ్టగ్' వద్దకు, తాను యుద్ధంలోగాని, మరి ఆట్టివిధమైన ఏదోఘటన వల్ల చచ్చేదాకా, ఆలేఖను ప్రకటింపవద్దని, సందేశంతో, పంపించాడు. ఈ లేఖపైనకూడ ఇద్దరు తుఫాను సైనికుల పేర్లు ఉన్నాయి. ఆ ఉత్తరంలో "పై చెప్పబడ్డ వ్యక్తులు కమ్యూనిస్టులకు చెడ్డపేరు తెచ్చి, నాజీశక్తిని దృఢంచేయడానికి, ముందు కల్పితంగా హిట్లరు ప్రాణాలుదీసే యత్నం, కెప్టెన్ 'గోరింగ్', డాక్టరు 'గోబెల్సు'ల సలహా తీసుకోవాలి" అని వుంది. తర్వాత ఈ అభిప్రాయం విడిచి రిచిస్టాగుకు నిప్పంటించే కుట్రకే ఎక్కువగ యిష్టపడ్డారు.

అర్నెస్టు రాసిన ఉత్తరంలో 'సభాభవనానికి నిప్పంటించే సామగ్రి అంతా ఉంచాక, అరగంటలో అదే రగులుతుంది' అని అది స్వయంగా కెప్టెన్ గోరింగ్ ఇస్తే, అతని ఇంటి దగ్గరనుండి తేబడింద'ని వ్రాశాడు. వుత్తరం పెద్దదేగాని సారాంశం ఈయబడింది. ఇందుచే, అసలు విధ్వంసకారులు, హిట్లరుచేతిలోవాళ్లు, కమ్యూనిస్టులో, స్పష్టంగా తెలుస్తోంది.

అప్పుడు న్యాయాధీశుని గుండె గబగబా కొట్టుకొంది. ఇప్పుడు డమిట్రాఫ్ని మాట్లాడనీయటమో, మాట్లాడనివ్వక పోవటమో, దీనిని నిర్ణయించేందుకు ముందు, కొంతసేపు కోర్టు ఆపబడింది. న్యాయాధీశుడు గుసగుస లాడటానికి

ప్రక్కగదిలోకి పోయాడు. కొంతసేపటికి బయటకువచ్చి డిమిట్రాఫ్ మాట్లాడేందుకు వీల్లేదన్నాడు.

కోర్టును కొంచెం అయినా లెక్కసేయక, డిమిట్రాఫ్ ఇలా గర్జించాడు "గోలిలిము" భూమి సూర్యునిచుట్టూ తిరుగుతుందని ప్రకటించినందుకు, శిక్ష విధింపబడ్డాడు. శిక్ష పొందాకకూడా ఆపీరుడు, పృథ్వి సూర్యునిచుట్టు తిరుగుతుంది' అన్నాడు. 'గోలిలిము'ను అనేకవిధాల బాధించారు. కాని భూమి సూర్యునిచుట్టూ తిరగడం మానలేదు. కమ్యూనిస్టుల్ని ఎంతపీడించినా, హింసించినా సంఘ చరిత్రక్రమాన్ని నిరోధించేశక్తి ఎవరికీలేదు. రక్తపతాకం తీసుకొని నడిచే భగ్నయోద్ధత్యాగ కార్మిక సైన్యం, దినదినం వృద్ధి చెందుతుంది. బలయుతమవుతుంది. ఆ పతాకం క్రింద, కార్మిక వర్గం—రక్తం—చెమటోడ్చే జనం—ముందుకు సాగుతూనే వుంటుంది. వేలకొలది సంవత్సరాలనుండి, హింస, బానిసత్వాలను నెలకొల్పిన ఆ అధికారాన్ని అంతంజేసి, మానవ సంఘ స్వాతంత్ర్యానికి పునాది వేయబడుతుంది."

కామ్రేడ్ డిమిట్రాఫ్‌వంటి మామూలు కంపోజిటర్ జీవనం, కేవలం ప్రెస్‌లో పనిజేసే కార్మికులకు మాత్రమేగాక, ప్రపంచంలోని ఇతర దేశ కార్మికుల వర్గకలహంలో ముందడుగు వేయడానికి ఉత్సాహం ఇస్తుంది. సాహసాన్ని వృద్ధి పొందించుతుంది.

సమాప్తము.

---



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | HPLAB03181 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 30-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 55 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | navya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good. |